శ్రీ సాంబశివాయ నమః

# సానందోపాఖ్యానము

వచనకావ్యము.




క. శ్రీధరుమతియను మేశుని । రాధామాధవవిలాసు రమణీభాసున్ ।
బోధానందున్ సుగుణాం । భోధిం డలచెద గృతిపరిపూర్తిగ సంగన్ ॥

అగణ్యంబగు నైమిశారణ్యంబున శౌనకాది మహర్షులు పురాణంబులు వినుచు సూతుంగని వినయంబున నిట్లనిరి. మహాత్మా నీవలన స్కాందపురాణ పుణ్యకథలన్నియును వింటిమి. సానందుడను ఋషిప్రభావంబు వినగోరెదము. అతడు యమపురికేల నేగె. అచ్చట నారకుల బాధలు పాపి కైలాసలోకంబెట్లు చేర్చె అతనికింత మాహాత్మ్యమేలగలిగె చెప్పుమనిరి. అయిన సూతుండిట్లనె. మహానుభావులారా సానందుం దలంపించిరి. యానందంబయ్యెడు మేనబులకలు వొడమెడు శివభక్తులలో సానందుడు ముఖ్యుడు. అతని మహత్త్వము వర్ణింపజాల, శివునికోరిన మనస్సే మనస్సు శివునికథలాలించు చెవులే చెవులు, శివునిం బూజించు చేతులే చేతులు శంభునివర్ణించు జిహ్వయే జిహ్వ, గౌరీనాథుం జూచెడు కన్నులే కన్నులు. శివునికి మ్రొక్కు నుదురే నుదురు శివాలయంబున కుంబోవు నడుగులె యడుగులు ఈశుని జపమే జపము భర్గుని భక్తియే భక్తి చిన్మయాత్ముని సేవయే సేవ శివునిదలపోయు నేర్పే నేర్పు శివుని మహిమ లెన్నెడు చదువే చదువు. కావున మునీశ్వరులారా శివకథ చెప్పు భాగ్యంబు గలిగించితిరి శ్రద్ధాళువులై వినుడు శివకథలని యిట్లనియె. సంసారమహీజంబునకు వాయువును అశాపర్వతంబునకు వజ్రంబును, పంచేంద్రి

యగజంబులకు సింగంబులును, అరిషడ్వర్గదవాగ్నికి బర్జన్యుండును పా
పమండూకంబులకుం దండశూకంబును దుఃఖసముద్రబడబంబును మో
హసారంగవ్యాఘ్రంబును ఖేదమను తమంబునకు సూర్యోదయంబును,
సచ్చిదానంద విభూతియు, హంసపరివృతంబునునగు బదరికాననంబొప్పు
నచ్చట సకలవేదవేదాంగాది సర్వవిద్యాపారీణుండై రంపవఘంసరి
కాననుండన బ్రాహ్మణాగ్రగణ్యుండు పూర్ణచిత్తుండు వెలుంగుచుండు.
అతండు ప్రజ్ఞకు శేషుని, శాంతికి భూకాంతను, సార్వభౌమంబున భార్గవు
ని, వేదాంతవిద్యకు బ్రహ్మను వైరాగ్యంబున శుకుని, బోధంబున సనకు,
శిష్టత్వమున వసిష్ఠు తపంబున గౌతమునింబోలు.

అతండు బ్రాహ్మ్యముహూర్తంబున మేల్కాని ముక్కంటిం డ
లంచి శిష్యులతో గంగకుం జనిగ్రుంకులిడి నిత్యవిధులాచరించి ఫాలంబు
నం బూదింబూసి యింటికేతెంచు అతండు సతతంబు శివభక్తి నిష్ఠాగ
రిష్ఠుండై నిటలాక్షుధ్యానించుచు హోమంబులుగావింపుచు సధికాదరం
బున నతిథులం బూజింపుచు సర్వజనరంజకుండై యుండె. అతనిభార్య
యార్యపరిచర్యారతయై యేప్రొద్దు పతిసేవ బాయక బహువిధ సేవలొన
ర్చుచు బతియె దైవమని తలంచుచు పతివ్రతాశిరోరత్నమై మెలంగుచుం
డు అదిబహురూపవతి, యువతి, సుగుణవతి, కాని సంతానహీనురాలై
యుండె. ఒకనాడే కాంతమందిరంబునం గాంతుంగూడి చెలునవ్వాలయు
నిట్లనియె. చంద్రుడులేని రాత్రి, దీపంబులేని గృహంబు, సింగంబులేనివ
నంబు, హంసంబులేని సరోవరంబు, బిడ్డలులేని గృహంబు, మనకు స
కలసంపద లీశ్వరుడిచ్చియు బిడ్డభాగ్యమీయడయ్యె. ఒకచక్కనికొ
డుకు గలిగెనేని చెక్కిలినొక్కి చక్కిలిగిలిపెట్టి పక్కుననవ్వెనేని ముక్క
త్తో ముద్దాడు వారిభాగ్యమే భాగ్యము కొడుకులుగలుగని దంపతుల
సంగమంబేటికి, భోగంబులేల విభవంబులేల గౌరవమేల భాగ్యమేల మే
డలేల, మిద్దెలేల ఇవన్నియు నబ్బించినను తన్నెలనంటివిచుమీ ప్రొద్దు
టలేచి గోష్ఠదానం జూపంబోవంబని పెద్దలు చెప్పుదురు. అపుత్రస్య
గతుల్లేవని నిగమంబు పలుకుచున్నది కద, మీవంటి మహానుభావులకుతె

సూంభవుండు లేకుండుట కొంతగాదె. భక్తజనసులభుండగు విరూపాక్షుని
వేడి గుణవంతుండగు పుత్రుంగోరుమని పలికినవిని యవ్వనితామణి హి
తమధుర ప్రియభాషణంబులకు సంతోషంబునొంది పులకాంకితగాత్రుం
డై యతండిట్లనియె। ఉవిదా! వినుశివుఁడు వదాన్యశేఖరుండు దేవేంద్రుని
కఖిలభోగములిచ్చె. నవనిధులు కుబేరునకిచ్చె. విష్ణునికి చక్రంబిచ్చె
బంగరుకొండం గింపురుషాదులకిచ్చె బ్రహ్మకు నిర్మాణశక్తియిచ్చె తన
యునకు విద్యాగురుత్వంబిచ్చె, అర్థశరీరంబు పార్వతికొసంగె. జహ్నుపుత్రి
నుడుపతినిధరియించె. కావున నతని దాతృత్వగుణంబు నుతింప నెవరితర
ము మహానుభావుఁడు, సజ్జనప్రియుఁడు, అవ్యయుఁడు, ఉమాధవుఁడు లోక
మంగళుఁడు, ఉదారకృపాశాలి, బ్రహ్మవిష్ణువందితుఁడు ఫణిభూషణుం
డు భోగమోక్షము లాశ్రయించిన వారికిచ్చును, కావున బాలా బాలేం
దు ధరునారాధించి శీఘ్రంబ కులపావనుండగు నొక్కచక్కని కుమారుం
బడసెదనని భార్యనింటనుంచి యరణ్యంబునకుంజని యొక్కసరోవరంబు
ప్రాంతంబంకజాసనాసీనుండై పంచాక్షరీ మంత్రంబుచ్చరించి భస్మంబు
సర్వాంగంబులనలంది రుద్రాక్షమాలికలుపూనిగురుందలంచి ప్రాణాయా
మంబాచరించి చిన్మయుండగు పరమశివుధ్యానించి యింద్రియంబుల గెలి
చి యరిషడ్వర్గంబుం బరిమార్చి యష్టపాశములగోసి భ్రాంతినిర్మూలంబు
గావించి సప్తవ్యసనంబులు నిర్జించి చిత్తంబు నిశ్చలయుక్తిం జేర్చి శివాని
శంబు ధ్యానించుచు పరమవైరాగ్యంబునొంది రాజయోగంబుననుండి స
ర్వము మఱచి సహస్రారపద్మంబున నిష్టదైవంబునిల్పి పరమతపంబొన
ర్చుచుండె. అంతకొన్నాళ్ళకు శివుండు ప్రసన్నుండైన సతనింజూచి యి
ట్లని కొనియాడె, నిర్మలస్ఫటికోపమకాంతిపుంజరంజిత దిగ్విభాగా జటా
జూటనటద్గంగాతరంగా, చంద్రరేఖాలంకృతశిరోవిరాజితా, ఫణిగణాభ
ణామణీమండితశరీరా, సూర్యచంద్రాగ్నినేత్రా గజచర్మాంబరధరా, త్రి
శూలహస్తా కాలకూటాలంకృత నీలకంఠా భసితాంగరాగ విలాసా
యష్టమూ సహాయావృషభారూఢా నీతేజంబుజూడంజాలంగరుణింపవేమ
న్నింపవే బ్రోవవేయని సాష్టాంగవందనంబాచరించి మేనంబులకలువా.

డమ నానందబ్రహ్మసంసిద్ధక్షేత్రముండైయని నిటలతటఘటితకరకమలుండై పు
టుండై నిలిచియున్నంజూచి సుందరఫాల శంకరుండు మందహాసంబునేసి
యిట్లనియె. ఓవిప్రోత్తమ నీతపంబునకు నిచ్చ మెచ్చితి. నీయిచ్ఛవచ్చిన
వరంబడుగుము. అనిన నతండిట్లనియె దేవా నేను బుత్రార్థినై నీకొఱకు
దపంబు సల్పితిని. సద్గుణయుక్తుడు. నీచభోగవిరక్తుడును, నీకుభక్తుడును
నగు పుత్రునిదయచేయుము అనిన భవానీనాథుండు కడుముదమందివి
ప్రశ్రేష్ఠరా, నీకు, శుభశరీరుండును సుగుణాకరుండునను, శాంతినిధియు ప
రోపకారియును నిశ్చలస్వాంతుని, అఖండశక్తిమంతుని, ఏమితలచిన ద
క్షణంబ దగ్గఱకువచ్చి నిల్చునట్టి మహిమగలవాని, కారుణ్యమూర్తియు
మత్పాదాబ్జభక్తుండును కులపవిత్రుడు గలుగవరమిచ్చితి అనిశివుండంత
ర్హితుండయ్యె, బ్రాహ్మణుండును పరమానందంబున నింటికేతెంచి త
ద్వృత్తాంతమంతయు నింతికింజెప్పె, నాయింతియెంతయుసంతసించె.

అంత గొన్నాళ్ళకు బూర్ణచిత్తునిపత్ని భద్రవంతి గర్భవతియయ్యె
తెల్లబాఱినమోము నల్లనిచూచుకములు గలిగియెలనాగ భస్మలిప్తశరీ
రుండును గరళకంఠుండునగు శివుంబోలె నట్లయగు గర్భస్థుండగు జీవుం
డు శివుడుగాడె. మఱియు నవ్విరిబోణి జఠరస్థశిశుప్రభావంబున శైవతే
జంబు నిండియుండ ధర్మంబులు సంయమీంద్రులవలన వినగోరు శంక
రువిమానంబు దెప్పించి దానిపై నెక్కగోరు నరకలోకవాసుల కైలాస
వాసులగావింపగోరు, శివసాన్నిధ్యంబుననుండగోరు. ఇట్లుండ కొన్నాళ్ళ
కు నెలలునిండె. ఆయంగన కోరికలెల్ల మగడు దీర్చుచుండె. అంతనొ
క్కనాడు శుభముహూర్తంబున కేంద్రాది శుభస్థానంబులగ్రహంబులుం
డ భద్రవంతి కులభద్రుండగు నొక్కకుమారుంగాంచె. అట్టిశుభవార్త
పూర్ణచిత్తుండువిని స్నానంబాడి పుత్రునకు జాతకర్మంబుచేయించి గో
భూహిరణ్యాది దానంబులిచ్చె. పేదకు పెన్నిధి దొరకినట్లు తత్త్వజ్ఞానిని స
జ్జనుండు గన్నట్లు, రవింజూచిన చక్రవాకంబురీతిని శివసమానుడగు నా
భూసురకుమారుంజూచి బ్రాహ్మణులు సంతసించిరి. పదపడి పూర్ణచి
త్తుండు కుమారునకు సానందుండను పేరిడి మిక్కిలి గారాబంబున బెంపు

చు యుక్తకాలంబున చోళోపనయనాది కార్యంబులొనర్చె. ఆకుమా రుండు మానాథాంశసంభవుండు గావున సకలవిద్యలు గురువునొద్ద నొక్కమాఱువిని గ్రహింపగలిగె. మఱియు నితండు సకలవేదాంత పురాణేతిహాసంబు లభ్యసించిశివుండె పరమదైవంబనినమ్మి మహాశివభక్తుండై యుండె, శివభక్తులంజూచి మాట్లాడు నన్యులతోడగూడడు. శివపురాణంబులు శ్రద్ధగలిగి వినుంగాని యన్యపురాణగాథల విననొల్లడు. శివమంత్రంబులు వినుంగాని యన్యమంత్రములు జపింపడు శివపదపద్మములజూడగోరుంగాని యన్యదేవతల జూడంబోడు. అతనివైరాగ్యము, అతనికల్యాణగుణములు, అతని శివభక్తి మాహాత్మ్యమునకు అతడె సాటిగాని యన్యులులేరు. తుచ్ఛభోగములకాసింపడు. తుచ్ఛమంత్రి జనంబులజోలిదలపడు. తల్లిదండ్రుల యాజ్ఞమీరడు లేశమాత్రమును ఇతరదేవతల నుతింపడు శివాంకితంబులగు కృతులగద్యపద్యరూపంబుననొనర్చు. శివునర్చించు శివుండు పరతత్త్వంబను లోకంబు శివమయంబనితలంచు.

ఇట్లుషోడశవర్షపరిపూర్ణుండై షోడశకళా పరిపూర్ణుండగు చంద్రుంబోలి దండకమండలువులు ధరియించి శైవచిహ్నంబులగు భస్మరుద్రాక్షమాలికలు ధరించి దివ్యసుందర విగ్రహుండై సనాతన యోగీశ్వరుకరణిందిరుగుచుండి యొక్కనాడు మునీశ్వరపుణ్యాశ్రమరమ్యంబగు నొక్క తపోవనంబుగాంచి యందుబ్రవేశించి శివుంగూర్చి తపంబొనర్ప నిశ్చయించి నిరాహారుండయి వేసవియందుగ్రంబునసహ్యంబునగు నెండయందును వర్షాకాలంబున నిరంతరధారాసారవర్షంబునను శీతకాలంబున కంఠదఘ్నసలిలంబులనుండి నిశ్చలుండయిహ్రదయాంబుజంబునంబులితోలు దాలుపును నిల్పి తపంబుసల్పుచుండె. అపుడయ్యాశ్రమంబుననున్న మృగంబులెల్ల సానందుని తపఃప్రభావంబున జాతివైరంబు మానివర్తిల్లుచుండె. ముసలిదియగు సింగంబునకు నేనుంగుకర్ణంబూతయిచ్చు. పాములపిల్లలకు నెండదగులకుండ నెమిళ్లు పించంబులు విప్పిపట్టి నీడకలిగించును. పులిపిల్లంగూడి లేళ్ళుకేళియొనర్చు, ఇ

ట్లుండ నొక్కనాడు శివభక్తులును భసితత్రిపుండ్రధారులును రుద్రాక్ష
మాలాధరులునగు కొందరు మునీంద్రులేతెంచి సానందుండు శివుండని
యెంచి సాష్టాంగవందనం బాచరించిరి. వారికిప్రమదంబున సానందుండె
దుర్కొని యథోచితపూజలాచరించి తోడితెచ్చి యుచితాసనంబులఁగూ
ర్చుండబెట్టి యిట్లనె. మహాత్ములారా పుణ్యప్రదంబగు నొక్కకథ జె
ప్పరే యనిన నందు ధర్మప్రసంగుండను మునిపుంగవుం డిట్లనియె. పుణ్యా
త్ములొందెడుగతులు పాపాత్ములొందెడుగతులు విస్తరించి చెప్పెద. విను
మని యిట్లు చెప్పందొడంగె. ఈభూలోకంబునఁ బుణ్యపురుషులు
దానధర్మోపకారాది సుకృతంబులనేకంబులు సేసి చిరాయుష్మంతులై సక
లభోగంబులం బరితృప్తింబొంది ప్రాణావసానకాలంబునం బుత్రమిత్ర
భార్యాబంధువర్గంబులు పరివేష్టించియుండ నందఱితోడ మాటలాడుచు
ననాయాసంబున గర్మశరీరంబులు విడిచి దివ్యశరీరంబులు దాల్చి. శమన
కింకరులు శాంతమూర్తులయ్యి తోడ్కొనిపోవ సంయమనీనగరంబున
కేగుదురు. ఆమార్గంబెట్లుండు ననిన బంగరుగృహంబులు స్ఫటికసోపా
నములు చంద్రకాంతవేదికలు. హిరణ్మయమంటపములు వైడూర్యకుట్టి
మంబులు ముత్యాలతోరణములు పానీయశాలలు మంచిమంచిమేలుక
ట్లు బంగారుమేడలుగలిగియుండు వెంశియువేగవంతంబులగు తురగంబు
లు భద్రగజంబులు రథంబులు, సుందరులగు సుందరులు సమస్తపరిమ
ళమిళితమలయపవనంబు వికసించిన కలువలదెల్లదామరలచే నుల్లసిల్లు
చు విమలజలములుగలిగిన సరస్సులునుగలవు. మఱియుం జందనమందార
మాకందపనస వకుల రసాల సాల నారికేళ ఖర్జూర ప్రముఖ తరు
చ్ఛాయావితాన శీతల భూరుహంబులును కురువకకురంటక కరవీర పారి
జాత కాంచనసుగంధబంధుర పుష్పారామప్రదేశంబులును గాంచనకమ
ల కల్హారకుముదపరిమళమిళితకమలాకరంబులును కలహంసమయూరశు
కపిక శారికాచంచలీకమనోహరనినదకోలాహలంబులును సద్యోఘృతద
ధిక్షీరమకరందఫలరసనదీప్రవాహంబులును పంకుమదకుంకుమ కర్పూర
పాటీరకస్తూరికాది సుగంధద్రవ్యంబులు పంకంబులు సేసి పన్నీటం బాం.

కించి గలిపిపోసిన కనక రాజతపాత్రంబులును గంధర్వమానినీ దాన మానంబులును పారిజాతప్రసూనవర్షంబులును ధవళచ్ఛత్రచామర కేతనశిబికాసమూహంబులును, గుసుమకిసలయకలితభవనంబులును జిగురాకుపాన్పులును సిద్ధరసదీపికలును ఎప్పుడుపెంగల్వ దోసిలనుగలిగి శోభిల్లుసమ్మార్గంబున నప్సరసముఖ్యలు గరుణాకలితహృదయులయి శివునకింకరులు మణిగణస్థగితకాంచనసముంచిత కోటిసూర్యప్రతీకాశ దేదీప్యమాన విమానంబులపైని నెక్కించి వేణువీణారావంబులును మంగళతూర్యరవంబులుం జెలంగం గొందఱు తురంగంబులపైని గొందఱ నేనుంగులపైని గొందఱ నాందోళికలపైని నెక్కించికొని పోవుచుందురు. మఱియు నీపుణ్యాత్ములకుఁ బడమరి కాంతలాలవట్టములు పట్టుదురు. కిన్నరాంగనలు వింజామరలువీతురు. గంధర్వస్త్రీలుగానంబు సేయుదురు. రంభాద్యప్సరసలు నాట్యంబు సేయుదురు. ఇట్టిపుణ్యాత్ములు యమకింకరులు సేయు ననేకవిధోపచారంబులనందుచుఁ బోవుచు నడుమనడుమ విశ్రమించుచు యముని నగరంబుఁ జేరుదురు. వీరినియమకింకరులు పురబాహ్యప్రదేశంబున నిలిపివేగ యమునికి మ్రొక్కి విన్నవింతురంతట నంతకుండు గరుడగంధర్వకిన్నరాదిగణంబులంగూడి చని యాపుణ్యాత్ములను వినయంబునం జూచి సంతసించి చిత్రగుప్తుంగని వీరలపుణ్యంబులు వేర్వేఱం జెప్పుమన్న నాతండిట్లనియె. వీరుపాత్రస్నానము చేయువారు వీరుకపిల నన్నాశించిరి. వీరుసజ్జనవిధేయులు. వారుపరస్త్రీసంగమంబులేనివారు వారుదీనులగాపాడినవారు. వారుదయాళురు. వీరుసత్యవ్రతపరిపాలకులు. వీరుసౌశీల్యముగలవారు. మఱియు సాలంకృతకన్యాదాతలు మిత్రులకొక్కలునిచ్చువారు. న్యాయప్రవర్తకులు, గురుభక్తులు, దేవతాభక్తులు, దుర్జనదూరులు, అరిషడ్వర్గవిజేతలు, పుణ్యతీర్థయాత్రికులు, యాగంబులొనర్చినవారు, శైవవ్రతపరులు, అతంద ధర్మవివాహంబొనర్చి బ్రాహ్మణులకు సకలపదార్థంబులదానమిచ్చినవారు. శివునకు పూవుదోటలొసఁగినవారు. సజ్జనులకు ఋణంబులిచ్చువారు. శైవులకు వస్త్రంబులుగట్టి సమర్పించె. అథమాఘమునకైననుప

శా॥ మొసఁగ్గినవారు. గ్రీష్మకాలంబున నిటలాక్షునకు వసుధారగల్పించి
నవారు. వైశాఖపూజలయందుం దాళవృంతంబులు పానకంబులు గం
ధంబులును పండ్లిచ్చినవారు. కఱవులలోనన్నంబువస్త్రంబు నిచ్చినవా
రు. చెడిచేరినచుట్టాలరక్షించినవారు యుద్ధంబుననిల్చిపోరినవారు, గో
దాన భూదాన, శాడ్డీదానములిచ్చినవారు. వేదంబుచెప్పినవారు శివాల
యంబున దీపంబుపెట్టినవారు శైవాలయప్రాకారంబు నిర్మించినవారు,
శ్రీశైలమేగువారికి ధనసహాయులయినవారు అభ్యాగతపూజలొనర్చిన
వారు. రోగులకు ధర్మంబుగమందులిచ్చి రోగంబులమాన్పినవారు శైవ
భక్తులంగని సాష్టాంగవందనంబాచరించినవారు. కలనైనఁబొంకనివా
రు శివునికోవెలయందాటలపాటలవారిని నిలిపినవారు శివునికిమండపం
బుగట్టించినవారు, రథంబుగట్టించినవారు శివునికైంకర్యమునకుగుఱ్ఱము
లనిచ్చినవారుకరులనిచ్చినవారు శివాభిషేకంబునకు తటాకంబు నిర్మించి
నవారుగోపురంబున దీపంబుపెట్టించినవారు శివప్రీతిగవృషోత్సర్గంబొనర్చి
నవారు పుణ్యనదులఁగ్రుంకినవారలుఉపవాసంబులొనర్చినవారలుజననీజన
కులువృద్ధులు, తనయులు, బంధువులు, హితులుభజించిన పిదపభుజించిన
వారు పంక్తిభేదంబు సేయనివారు, శిథిలంబులైన శివాలయంబులం బున
రుద్ధారణంబొనర్చినవారు వృద్ధులగు తలిదండ్రులం బూజించుచు శు
శ్రూష చేయువారు జితేంద్రియులై యుండువారు లోకాపవాద భీరువు
లు, పరదూషణవిముఖులు, పితృకార్యరతులు. పరధననిరపేక్షకులు, ప
గులదూషణ సహించినవారు, విద్యాసక్తులు, సదోద్యదాతలు, పకపక్ష
వర్తులు, కీర్తిమంతులు, శివకథాశ్రవణాసక్తులు, శివపూజకు పూవ్వు
ల్పెంచువారు శృంగారాదిరసంబులతో శివునిపేర ప్రబంధములు చెప్పిన
వారు ధర్మారామంబులు పెట్టినవారు కఱవులలో జొండ్లిండ్లు చేయించి
నవారు చీమలు, దోమలు. నల్లులు, పేలు మొదలగువాని హింసింపని
వారు పాపంబు మనసునకైన దలంపనివారు పరుల సంపదలకు పరమా
నందమొందువారు తల్లిదండ్రులయిన గురువులయిన దోసమున్నను వా
రింపలుకనివారు కాశికేగువారికి వెచ్చమునకు విత్తమ్మును పాదరక్షలు

నిచ్చినవారును మద్రాక్షదానం బొసగ్గినవారు నుభయము ప్రశంసింపదంఁ
కరతీవ్రాతప కాలంబుల బ్రాహ్మణులకు శైత్యోపచారంబుగ దధ్యోదన
గుడజలసుగంధగంధపుష్ప తాంబూలచ్ఛత్ర చామర పాదరక్షాదానంబు
లిచ్చినవారు నిరతాన్నదాన కనకరత్నాంబరాభరణ సాలగ్రామశివలిం
గదానంబులొసగ్గినవారును, పరోపకారాది సుకృతపరాయణులును,
సంక్రమణ, గ్రహణకాల ప్రశస్తసవత్సధేను గణదక్షిణా తాంబూలప్ర
ముఖదాన వినోదులును సర్వకాలంబుల మార్గంబుల బ్రపాదంబులు స
డిపించిన మతిమంతులును, అగ్నిష్టోమాతిరాత్ర వాజపేయపౌండరీకప్ర
భృతి యజ్ఞంబులుగావించినవారును, మహీసురుల కగ్రహారంబులు క
ల్పించినవారును, శివస్థానంబు లేర్పఱ్చినవారును, ఇట్లనేకవిధంబుల సక
లధర్మంబు లొనరించిన పుణ్యపురుషు లిందున్నారని చిత్రగుప్తుండు చ
దివి వేర్వేఱంజూపినం గారుణ్యంబునంజూచి యముండప్పరమపావనుల
బహువారంబు గౌరవంబొనరించి ముకుళితకరకమలుండై యిట్లని
యె. ఓపుణ్యజనులారా, యోమహాత్ములారా, మీరిటు నేంచేసితిరో.
దయచూపితిరి ధన్యుఁడనైతిని. మాభటులు మిముంగొలిచి వచ్చునపు
డపచారము లెక్కింతయేని గావింపరుగదా, చాలదూరము వచ్చితిరి. అల
సితిరి. చాలాసేపయ్యె, మానేరములు మన్నింపనేఁడెదనని వారినందఱ
కనకమణిమయవిమానంబు లెక్కించి దేవతాస్త్రీల వెంటంగూర్చి య
మరావతికింబంపె. తూర్యనాదంబులు చెలంగె. పుష్పవర్షంబు గురిసె.
ఇట్లువారలు స్వర్గంబునకేగి యింద్రునిచే సత్కరింపంబడి సుఖులై సు
స్థిరులై యుండిరి. అనిన సూతుంగని యామునులు తరువాతికథ చె
ప్పుమనిన నిట్లనియె. సానందానందంబునొంది ధర్మప్రసంగుంజూచి మ
హాత్మా మహాత్ములకథలు చెప్పితివి. కర్ములగతులు చెప్పుమనుటయు
ధర్మప్రసంగుండు సానందుండగుచుం గనుంగొని యిట్లనుఁ బాపాత్ములగతులు
దెల్పెదవినుము. పాపంబులుచేసి పాపాత్ములు ప్రాణావసానకాలంబున
శ్లేష్మంబు కంఠగతంబై దేహంబులెఱుంగక దైన్యంబునొంది దద్దఱిల్లి
యుండ యమకింకరులు భయంకరోదగ్రవిగ్రహులై ప్రాణంబులు

పాశంబులందీసి యాతనాశరీరంబునం దుంచి మెడకు గొలుసులుపెట్టి కు
క్కలగొనిపోవురీతిగా యమపట్టణమార్గంబున నీడ్చికొనిపోవుచుందు
రు. మార్గంబందు క్లేశంబువినుము. గహనంబును కంటకంబులు,
కత్తిరాళ్ళు, వేడిమిగలయెండయు, క్రూరమృగంబులు, శాకినీఢాకినీగ
ణంబులు, సుడిగాలి, భయంబు గలుగునట్టుల నఱచు బెబ్బులులు, సూ
కరంబులు, ఎక్కడజూచిన చిటచిటయని నఘంబంటివంటు మంటలు
ను, కనుమలును, గుట్టలును, పల్లములును, కుంపట్లు, కంపలు, డొంక
లు వసనాభిగాలి, పాములు, తేళ్ళు, జెట్టులు, ఇనుపముక్కులు గలకా
కులు, వాడికోఱలుగల కుక్కలు, గచ్చపొదలుచ్చకాలువలు, శున
కములు హాయముల మూత్రము, వెచ్చనిగాడిదెలద్దెలు, చచ్చిముగ్గి
కంపెత్తిన జంతుకళేబరములు పాడునూతులు, బాడలు పేడగుంటలు,
పెంటదిబ్బలు, పెద్దగద్దలు కంకములు, పల్లేరుగాయలు, గుల్లలు, కొం
డచీమలబారులు గొల్లున గూయునక్కలు, అఱచి యదల్చెడు పిశాచ
ములు- పిడుగులుపడుట, నిప్పులుగురియుచు మేఘములు లేనివానలు,
పురుగులు, రొంపియైన నున్నపుటేళ్ళు, గొప్పచీకటిపుట్టించు పెనుపొద
లును, గొప్పతుమ్మెదగుంపులు, కణుదారిగలు, కన్నులు దెరువనీయనిగా
లిదుమ్ములు, ఉష్ణరమంజెడి యుప్పరాసులు, ఉడుకుమన్న యిసుకలు,
దుర్గంధమెత్తెడు జలదారిమడుగులు, గలవు. అట్టిదుర్గంధము దావాగ్ని
ఎముకలపోగులు, వేదన, ఖేదము, సుడిగాడ్పు, అడవి, మేదఃపంకము
రక్తకూపము, భూతంబులుగలుగు నాత్రోవం బోవుచో జీవులాహాయోపా
పంబేలచేసితిమని మొఱలిడుదురు. యమభటులచే గొనిపోబడునపుడు కొ
రలరక్తంబుదొరివి తోడేళ్ళు బాధింపనేడ్చువారు పులులసంపడింబడవా
రలువారు కన్నులుపొడుచెడి కాకులచేతను, గండుతుమ్మెదలకునులోనై
యొదిగెడువారును, కాయంబులుడుకెత్తగా నెండకును అగ్నిజ్వాలలకు
నులికిపడ్డగా గూలువారును భయంకరంబులగు పాములంజూచి పారిప
రులంబడువారును, అడుగులు తొట్రుబడి నున్నపు టేళ్ళలో బడువారును,
కాళ్లుపగిలి కత్తిరాళ్ళ ముండ్లు పల్లేరుగాయలుతగిలి యేడ్చువారును,

మహాబలంబునవీచు గాలివడిచే ఱాయి గచ్చపొదలలోఁబడువారును, పి
డుగులమ్రోతకు భీతిల్లి యుచ్చకాలువలలోఁ జొచ్చువారును, నిప్పులవా
నకోర్వలేక తుమ్మకంపలలోఁ దూఱువారును, శూలప్రక్కల రాలవానగురి
యుచుండ భూతంబులచెంతకు జేరువారునునై దీనులై దిక్కులేక శో
కింపుచు పోవుచుండ యమకింకరులు కఠినాత్ములై, కొట్టుచు, ది
ట్టుచు నలియగొట్టుచు, సొమ్మసిల్ల దట్టుచు, అలిసితన్నుచు వెన్నుచఱచు
చు చచ్చినట్టుగొట్టుచుమూటకట్టగాకట్టుచు పెనుములతో మోదుచుభూతం
బులు కోపింపుచు, కంఠములంబట్టిన నెత్తురుగాఱ బిట్టొప్పుచింపఱవందఱ
చేయుచు, మూర్ఛగొంది యెంతసేపటికిని తెలివిరాకయుండువారును,
కాకులుగద్దలు పొడ్వగా, కోకోయని యార్చి నేలగూలగా పైబడికండ
లు పెరుకగా శోకాకులపడి యవయవములు చీమలుదిన నేడ్చువారును, సా
కంబులుగబళించి మేనులు బాధింపబెగ్గడిలువారును ఈబాధలకు సుళ్ళి
క్కిపాఱిపోవుచు గుక్కలచే జుట్టుబట్టి యెటుపోలేక నేడ్చువారును, విడు
వకఱగియు నిప్పులవానలో మలమలమాడువారును, కొఱ్ఱత్తుసున్నపు
కళ్ళలోవేసినునుసురమనిశేపిన సుళ్ళిక్కువారును, అగ్నిజ్వాలలంబడియొడ
ళ్ళు పొక్కిపొరలి యేడ్చువారును, నిలువనీడలేకనీళ్ళకు వాపోవగాయమ
కింకరులులాగిననేడ్చువారునై యుండిరి. ఇట్లు యమకింకరబాధితులై
నారకులుమఱియు, దండధరభటులు గుప్పగుప్పనంగుదిగొప్పించి యొ
ప్పజెప్పుచు, జెప్పలెత్తి తెప్పతెప్పన గుప్పించి మోములనాయమొత్తుచు,
మొత్తుకొమ్మని గొట్టురాళ్ళవేసి సిళ్ళబెట్టి చేకొద్దిదిప్పి ఱివ్వఱివ్వన ఱి
వ్వుచు గొఱివ్వణంగ గొంతదూరంబు నిబ్బరంబుగ పరువులుపాఱించి
ముండ్లపొదరిండ్లదూరినవల్లె తాళ్ళకుదగిలించి తెలియంగిఱ్ఱుకంపంబుల
దెంపునకొంకిముండ్లుగలకాశికొన్ని కండలుకండలుగా రాలనీడ్చియు,
నిట్లునికావస్థలదూలించియు, చబుకులంగొట్టియు, చుబుకంబులదట్టియు,
మడిమతాకులంబరచియు బెడచేతులంజరచియు పచ్చదబ్బలమోదియు,
బహుమారపథంబులు బహుప్రయాసంబున నడిపించుకొనిపోయినవచ్చె
నటులు నొచ్చియు విచ్చియు సోలుచు వీలుచు సొలయుచు నలయుచు, క

డలేనిదుఃఖంబులంగుందియు పడరానిపాట్లంగుందియు మధ్యందినమా
ర్తాండకిరణంబుల వేడిమిని మండియు, దావానలకీలలంగాలియు, మం
గలంబుల వేగియు, భూతప్రేతపిశాచబ్రహ్మరాక్షస శాకినీ ఢాకినీ కోలా
హలక హకహార్భటంబులకు లోనియు దావానలకీలలం గాలియు, ఝంఝానిల
పాతంబులమూలియు, నెత్తురు కేంటులం దేలియు, గర్తంబులగు గ్రుంకియు
పాషాణచూర్ణహారికంబుల గ్రుంకియు. వేదనలగరంగియు, గస్తిశ్రమము
నింగియు, మృగపక్షిగణంబులవలనం గాయంబులను గాయంబుల మూ
గిన మశకమక్షికపిపీలికాదికాయంబులు వికీర్ణంబులైన కేశపాశంబుల
ను విచ్ఛిన్నంబులయిన ఘాలదేశంబులును, తృష్ణాక్షుధాబాధలకు నిలు
వరింపనేరక పెదవులెండినం దపించుచు నీటికి వాపోవుచు కూటికినోరు తెఱ
చుచు. దగ్గుత్తికలు ముట్టబెట్టుచు వెన్నంటిన కడుపులును, గుంటబడిన క
న్నులును. దుమ్ముపడిన చెవులను సొమ్మసిల్లిన తనువులును గలిగి యు
ప్పుడప్పాపాత్ములు దమలోనిట్లనుకొనిరి. మహాదేవుని చింతింపమైతిమి.
ధర్మంబుదలపమైతిమి. గురువు కావలెనని కోరమైతిమి. ఈశ్వరుమహి
మ తెలుపమైతిమి. శైవశాస్త్రంబులు చదువమైతిమి. శివభక్తులంబూజిం
పమయితిమి శివభక్తులంజేరమైతిమి. కామక్రోధంబుల విడువలేమైతిమి.
మోహంబుమానమైతిమి. ధర్మంబొనర్పమైతిమి. శ్రీశైలంబునకరుగ
మైతిమి. తీర్థయాత్రలు జేయమైతిమి. పుణ్యతీర్థంబుల మునుగమై
తిమి. గర్వంబు డింపమైతిమి. గొప్పవారల మనుకొంటిమి. ఇష్టు
ల, బంధులదూషించితిమి. జ్ఞానులనిందించితిమి శివభక్తులదెగడితి
మి పరులమేలోర్వమైతిమి పరులబాధ పెట్టితిమి పరస్త్రీలగూడితిమి పు
ణ్యాత్ములజంపితిమి రోగులచేయి చూడమైతిమి. శివతత్త్వంబుల జదువమై
తిమి మంకుతనము మానమైతిమి, కీర్తిసంపాదింపలేదు, మన్మథబాణ
వేదనల కోర్వజాలక యింతులంగూడి సుఖంబని మోసపోతిమి. ఇప్పటికె
న్ని కష్టములందితిమింకెన్ని రానున్నవో, పెద్దలమాటలు వినక యిష్టము
వచ్చినట్లు సంచరించినందున నిప్పుడు వారిమాటలు సత్యములయ్యె దుః
ఖఫలంబనుభవింపుచుంటిమి. మనకింక దిక్కెవ్వరుని కన్నీళ్లువరదలై

పాఱచేష్టుచు నలుదెసలం గనుంగొని, భీతులైయున్న పాపులంగని మ
హోగ్రకోపావేశులును, సందష్టదంష్ట్రాగ్రరాళ వికటాట్టహాసవదనగ
హ్వరులును బ్రళయకాల కాలనీరదసంకాశ భయంకరాకారులును జం
డప్రభోద్దండ దోర్దండమండిత కాండకోదండభిండివాల ప్రముఖనిఖిలా
యుధనికాయులును దుర్నిరీక్ష్యతామ్రనేత్రులునగు కాలకింకరులు నూ
ఱ్ఱేషణంబులు వీక్షించి. కోపంబు మొగంబులరూపింప నప్పాపకర్ములఁ
కిట్లనిరి.

మీరు దుష్టాచారులు మిమ్ముఁజూచినంతనె పాపములువచ్చు.
మీరెట్టిమాటలాడి గారణం బేమి. కష్టములు గట్టెక్కెననిగర్వించి యి
ష్టాలాపములాడుచున్నారా, ఈమూత్రి మీపురీషము. ఈమురిగిన కు
క్కమాంసము ఈచెడుమలము. ఈగాడిదెలద్దెయు మీకు భోజనములు
ఇకమీకువిచారమేల పాపముచేయగూడదని పెద్దలు బుద్ధులుచెప్పగా
గద్దించితిరి. వారిపై కంఠపూర్తిగా కోపముద్వేషము కలిగియుండెను.
పాపములేదు, గీపములేదని పెద్దల నాక్షేపించితిరి. చచ్చినమీద జీవు
డేమగునో యేకష్టములఁబడునో మూఢులైతిరి. ఇప్పుడు జ్ఞానమువచ్చెనో
యని తర్జనభర్జనలుచేయుచు ధనలోభంబునగాని పనులుచేసి వచ్చినారు
మీపాపఫలంబు సమీపింపగా నాలోచనవచ్చినది. మీతోమాకు సర
సాలతోపనిలేదు. మదమాత్సర్యంబులు వదలక మదపతులంగూడి మ
దనకదనం బొనర్చితిరి. ఎఱిగిచేసిన పాపమునకు ఫలంబువద్దన్నం బోవు
నే పుత్రదారాది పోషణంబునకై ఘోరపాపములొనర్చితిరి. అవియి
పుడనుభవింపుచున్నారు. వారువచ్చి మీకడ్డుపడిరా, తాజేయుపుణ్య
పాపములు తననీడవలె వెంటనంటివచ్చును మీరెంతచింతిల్లినను ప్ర
యోజనంబులేదు మీరెంతవంతనొందినను మాకుజాలికలుగదు మా
రాజుపాదములాన, ఇంటిలో ప్రవేశింపకమునుపె యెలుకలరాయిడి యు
న్నట్లు, యమపురంబు ప్రవేశింపకమునుపె యాతనలు తలచుచున్నా
రు. మీనడక గుమ్మడికాయలో నావగింజంతయైనగాలేదు. భూమికి
యామ్యపట్టణంబునకు నెనుబదాఱువేల యోజనంబులదూరంబు ఇంత

మీ రెప్పుడునడచెదరు. అని క్రోధఘూర్ణితలోచనులగుచు యమభటులు
గొందఱుపాపుల గుదియల గొట్టుదురు. కొందఱిని పరిఘలతో త్రోలు
ద్దురు. ఒకనిని కోలలతోఁ గొట్టుదురు. ఒక్కని నెఱ్ఱగ గ్రాగిన లోహపు
గుజ్జుముపై నెక్కుమని గొట్టుదురు. ఒకనికఱ్ఱలతో మెత్తగ మొత్తుదురు
ముండ్లకంపతో కన్నులు పెరుకుదురు కొఱవులెత్తియుంతురు. భల్లము
లతో నొకని గొట్టుదురు. ఒకనిపటుకాలితో బట్టుదురు ఒకనిజగ్రాతిం
బెట్టికొట్టుదురు ముసలాయుధంబులతో గొట్టుదురు కత్తులతో పొడుతురు
శూలంబులతో వ్రేతురు. ఒకనియంగంబులం గోయుదురు. కుంతములరొ
మ్మునబెట్టి బాధింతురుఒకనిపై కెగిరవేసికత్తి యొగ్గుదురు రాలుమోయిం
తురు గిరగిరద్రిప్పి నేలబెట్టికొట్టుదురు కుక్కలగఱపింతురు గాడిదలచే
ద్రొక్కింతురు తలబగులగొట్టుదురు వీనికి బాలదండలన్న వేడుకయని
తేళ్ళదండలు కంఠంబున వైతురు. ఒకనికి సగిలని పాములనువేయుదురు.
దాహమని యడిగిన నుప్పుబెట్టుదురు. సంగీతము బాడుమని యొకని
కన్నులలో మిరియములునూరి యుంతురు. జెముడుపాలు పోడిపింతురు.
పరిమళవస్తువు లితనికి బ్రాణమని శునకసూకరమలము కస్తూరియని జ
లదారినీళ్లు పన్నీరని కలిపిపూయింతురు వేపచేదు, నేలవేము, అభిని,
ముష్టిపండ్లు నాత్మజలముతో నూరికలిపిగొట్టాలతో నొకని చేతనింకొకనికి
బోయింతురు వీడు ఎన్నిజంతువుల జంపినాడు. ఒకనాడును మాంసము
లేదేని యన్నమునోటికిబోదని వానిశరీర మాంసముగోసి తినిపింతురు.
దాహమన్న తగరము, సీసముకరగించి పట్టిపొట్టనిండ బోయుదురు. జి
ల్లేడుపాలలో గుల్లసున్నముకలిపి త్రాగింతురు. కుళ్ళినకుక్కసంజుడు,
గాడిదలద్దె తినిపింతురు సలసలగాచిన నూనెనెత్తి మునుగునట్లు పోయు
దురు దురదగొండి, పల్లేరుకలిపి పలుగుబెట్టుదురు. ఉడుకుచున్న గుజ్జు
పుటుచ్ఛలోముంచియెత్తుదురుఎంతకున్నోర్వలేని యొకవిటుంబట్టికట్టా వీడు
తనవనితందలంచి విరహవేదన నొందుచున్నాడు. వీనికొసుఖము కలిగిం
పకున్న దుఃఖము చల్లారదని వీనికి శైత్యోపచారం బొనర్పవలయునుగా
దెయని యొంటలోఁగాలిన యినుకప బనుండబెట్టి పల్లేరుముళ్లు త

ప్రంబుగఁ జేసి గంపెగత్తెర తలగడగఁ జేసి యమదూతలకు నరకాళ్ళకు నా
వపండ్డపట్టించి కన్నులలో మిరియంపుకాయలు పెట్టి కళపెళ కాగుచున్న
నూనెపైపై జిలికి బగ్గునమండెడు కుంపట్లు పెట్టి రేగుకంపలు సాకునట్లు
గా విసరుచు నోటఁబొంత జెముడు పాలుపోసి కాలెడు ఇనుపతుండు దెచ్చి
యిదె కాంత కౌఁగిలించుకొమ్మని చెంతఁ జట్టి యిట్టిభోగమీరే కాలమం
దైన ననుభవించితిరే యనుచును శైత్యోపచారంబులు చాలున యను
చును నలియఁగొట్టుచు భటులు యమపట్టణంబుం జేర్చిరి.

అంతసకలరోగంబులు మూర్తిమంతంబులై కొలువ నీలమణిపీ
ఠంబున నీలనీరదసంకాశ భయంకర విగ్రహుండును బ్రజ్వలజ్జ్వలన జా
జ్వల్యమానరూక్షేక్షణ వస్త్రాలర క్తనేత్రుండును చండయుధ హస్తుండు
ను నీలమరకతశ్మశ్రు తమకుటుండునునై నిండుకొలువున్న యముంగాంచి
సాష్టాంగదండప్రణామంబు లాచరించి చేతులు మోడ్చి యిట్లనిరి. దేవా
నీయాజ్ఞ శిరసావహించి భూలోకంబున కేగి పాపులం బాశబద్ధులఁ జేసి నీ
సన్నిధికిఁ దెచ్చితిమనుచు నాగ్రహంబునలోనికి దీసికొనిరండనియె. వారు
తెచ్చియెదుటనిల్పిన కోష్ఠంబునంజూచి చిత్రగుప్తుంగని యిట్లనియె. ఓ
మహాత్మా చూచితే యీమహాపాపుల వీరింగనుగొన్న పాపంబుగ
లుగు వీరలెవ్వరే యేపాపంబులొనర్చిరి వేర్వేఱం జెప్పుమన్న నతండు
కవిలెకట్టుం దెచ్చి యిట్లు చదివె. దేవద్వేషులు వేదదూషకులు బ్రహ్మ
ణవిరోధులు గోహంతలు, శైవద్వేషులు, లోకబాధకులు నీచచిత్తులు
అన్యాంగనాలోలుపు, భస్మచోరులు, దుశ్శీలురు లోభమోహావేశులు,
మద్యపానరతులు, అన్యాయప్రవర్తకులు ధూర్తులు, చలచిత్తులు, గు
రునిందకులు సంసారమోహితులు, కులనీతివర్జితులు, కోపులు, కుత్సి
తులు, మాంసప్రియులు, దుష్టవర్తనులు, కాపట్యప్రధానులు, కలు
షాత్ములు, సాధుబాధకులు, మూర్ఖస్వాంతులు, క్రూరులు, పరధనాప
హ్రులు, బంధువిరోధులు మిత్రవంచకులు, వాదిభేదబుద్ధులు, అహంకా
రప్రధానులు, జీవహింసకులు. గురుపితృభక్తి విరహితులు అనివేర్వే
ఱంజెప్పి, పిదప శివాలయంబున కెన్నఁడుపోడు, సాధుదుష్టుల సావాసము

చేసినవాఁడు వాఁడు వేదవిప్రవిరోధి, వీఁడు విష్ణుద్వేషి వీఁడుహింసకుఁడు వాఁడ
ధర్మప్రవర్తకుఁడు, వాఁడుదుర్గుణశిఖామణి హరిహరపూజా బహిర్ము
ఖుఁడువీఁడు. హరిహరకథలు విననిపాపివీఁడు, హరిహరనామంబులు గీర్తిం
పనివాఁడువీఁడు హరిహరుల గొల్వనివాఁడువీఁడు హరినైన హరునైన మ్రొ
క్కనివాఁడువీఁడు హరినైన హరునైన సేవింపనివాఁడు: మదపుటేనుగువ
చ్చితఱిమినా భయముచేగాని మఱచిగాని శివాలయంబు ద్రొక్కఁడయ్యె
వీఁడువాఁడుపర్వదినంబులని చింతింపక యింతుఁబొందుగలిగె. వీఁడుశివా
లయంబున జార వినోదంబులొనర్చె. వీఁడుయుద్ధంబునం బ్రభువునకునో
ప్పుగలిగించె. వీఁడుసూర్యాభిముఖుండై మూత్రంబువిడిచె. వీఁడురాత్రు
లందశుచియై జ్యోతులంజూచె. వీఁడుతప్పుసాక్ష్యమిచ్చి పరులకు ముప్పు
గలిగించె. వీఁడు లెస్సగా గిన్నయింటికి పాసిదలంచువాఁడు పెద్దలకుదారి
వెట్టఁడు. వీఁడుగృహారామహారుఁడు. వీఁడు రాజసభలంగుంజేరి లంచము
నిచ్చి జ్ఞాతులకు ద్రోహమొనర్చె. వీఁడు బ్రాహ్మణక్షేత్ర వినాశకుండు
వాఁడింటం జేరియుప్పుచప్పని మాటలుచెప్పి మాయచేసిసంసారులగు స్త్రీ
లం జెఱిపి సంగమించువాఁడు. ఋతుమతియై పతికొఱకు వేచియున్న పరస
తితో నీతులువగూడె. సోదరుల మేలోర్వలేక, మంత్రములచేతను,మం
దులచేతను జంపినమహాపాపివీఁడు. వీఁడుయాచకులై బ్రాహ్మణులకు రే
పురా మాపురా యిచ్చెదనని త్రిప్పి తుదకు గసరికొట్టె. వీఁడెల్ల కాలము
దబ్బరలాడుచుండు. తండ్రితద్దినమని పెద్దలుచెప్పినా మాకక్కఱరాదని
మానినపాపివీఁడు. భోజనమందు పంక్తిభేదముచేయువాఁడువీఁడు. భార్య
మాటలు విని తలిదండ్రులకు కీడుచేసినతుంటరివీఁడు. వీఁడుభిక్షుకులంబిలిచి
బిచ్చమిచ్చెదనని చెప్పి కుక్కలనుసిగొల్పెను. కరపించెను. జారచోరత్వ
ములసంచరించినవాఁడువీఁడు. వాఁడువావివరసలులేనివాఁడు. వీఁడుకపటవ
ర్తనుండు. వాఁడుశివరాత్రులందుభుజించి, శివభక్తులంజూచినవ్వి, శి
వుందూషించి, శివనిర్మాల్యము ముట్టక శివకంటకుఁడయినవాఁడు. స్నే
హముచేసి తన్నునమ్మి నిష్కపటంబుననున్న స్నేహితునిజంపఁజూచివా
ఁడువీఁడు. వీఁడుసజ్జననిందకుఁడు, వీఁడుగడియకునూఱువిధాలనాలోచనల్లు చే

సిగకోతలమారి. కుక్కలు, కాకులు, పందికొక్కులు, పిల్లులు, జపు
లు, కుష్ఠురోగులు, జారకాంతలు, కోళ్ళు, ముట్టుతలు, నపుంసకులు,
రుద్రాక్షధారులు వాకిసను స్నానముసేయనివాడువీడు వీడు శివాల
యంబులో విబూది యిచ్చిన పార్వతి చె. శైవపురాణ ప్రసంగంబుగలి
గెనా వీడు లేదను భస్మరుద్రాక్షధారులం జూచి వీడుదోషంబులెంచె. శి
వభక్తునిజూచివాడు దూషించినాడు. శివుడూరేగుచు దనగుమ్మము దగ్గ
ఱకురాగా చన్నవదలుపు బిగించిన పుణ్యుండువీడు. తనకు తెలియకు
న్నను సమస్త శాస్త్రపండితుండనని శివభక్తులతో వీడు వితండవాదము
లాడె. వీడు సోహించకుండు. వాడుగజహించకుండు. వాడశ్వభేదనుడు. వీ
డావులక్ష్మి తృణజలంబులవలయువేళలబెట్టకహింసించె. వీడుబ్రహ్మహత్య
లుచేసె. వాడుబ్రాహ్మణాంతో వీడనిశంబు సురసేవించు. వీడునగలుచేసియి
చ్చెదని బంగారముదెప్పించి తూచి సన్నయిచ్చి బంగరుపుచ్చుకొని వస్తు
వులుచేసి యియ్యక హరించినవాడువీడు. వీడన్నకుబెండ్లికానుండ తా
నుపండ్లాడిన పరిగెత్తె. వీడురాజునొద్ద నమ్మకముగనుండి రహస్యము
రాజుశత్రువులకుంజెప్పి రాజ్యంబు నాశంబునొందించిన రాజద్రోహి
వీండవనిపిల్చిమందులుపెట్టి జ్ఞాతులను వీడుచంపినాడు. వంచనలేక నమ్మి
కొలిచిన భృత్యులయందు నేరముమోపి జీతమెగబెట్టిన దిట్టవీడు. వీడు
కన్యావిక్రయముమొనర్చె. వీడుబ్రాహ్మణకన్యనకలజెరబట్టె. వీడుపుణ్యాత్ము
లనూలనాడె: వాడు విశ్వాసఘాతకుడు. వీడుపలువురిలో తనప్రగల్భ
ములుచెప్పితన్నుస్తుతించుకొన్నాడు. దొంగలచేరదీసిభాగ్యవంతులయిం
డ్లకు కన్నముపెట్టించి ధనమార్జించి నదుండగీడువీడు. వీడుపేదలయిండ్ల
పైబడితినును. శూరుడనని మాటచెప్పి యుద్ధముచూడగానే పరుగెత్తె
డుబంటువీడు. నూటికొక్కటైన సత్యముపలుకక నిష్ఠురభాషణములాడునీ
చుడువీడు. వాడుతాజేసినపనులు పరులకు దెలియవలె ననిషంబముగలి
గి ప్రకటించును. పంచాక్షరీమంత్రంబు జపించడు, విభూతినుదుట బెట్టడు
పుణ్యకార్యముచేయడు. నీతిలేనివాడు. వీడు హరునినిందించినాడు. వీడు
హరకథలు గలుగుచోట చెవులుమూసికొనియె. ధాతువులకుణష్టుదెలి

యెఱుఁడు. నిదానము లేదు. రోగముగని పెట్టలేఁడు. కాలముదెలియఁడు. దూ
తలక్షణము లెఱుఁగఁడు. ఔషధగుణము లెఱుఁగఁడు. వైద్యుఁడనని బయలు
దేఱి యనేకులం జంపినాఁడు. ధనమార్జించినాఁడు. సంగీతములు వినును.
కళాశాస్త్రములు వినును. శైవశాస్త్రమహిమంబు వినఁడు. భోగభామల
గూడి పొద్దుపుచ్చునుగాని, ధర్మగుణము దలఁపఁడు. అక్కఱలేనిపనులకు
పరుగులెత్తునుగాని పుణ్యతీర్థయాత్రలకు అడుగువెట్టఁడు. సంసారమం
దలి యాశచే కష్టపడును పరలోకవాసంబులోనరయఁడు. ధనమార్జించు
నుగాని దానంబు చేయఁడు. ఒకరికి బుద్ధి చెప్పఁబోవుంగాని తనతప్పు లెఱుం
గఁడు. ఉదయాస్తమయంబుల నిద్రించును. అమవసనాఁడైనా నదికిపోఁడు
యెప్పుడు కల్లు ద్రాగును. అమంగళుఁడు. తేలు బల్లి త్రోవలుగాచి ని
ద్రముభోజనము లేక దంపము చేయఁబట్టి బాటసారుల నడ్డగొట్టి భయము
పుట్టించి కాసువీసము సంపాదించినవాఁడు వీఁడు. వీఁడు తిరునాళ్ళకేఁగి క్రి
క్కిఱిసియున్న తెరవలపాలిండ్లు రాచికొనుచు తిరిగి వారివస్త్రములు కత్తి
రించి హరించినమాలవాఁడు వీఁడు ఒకనాఁడన్నము కొంచెము తక్కువైన త
ల్లిం గొట్టుకొనికొట్టును. అన్నము వేళకు ఇంటికివచ్చిన. పాటుపడఁడు. ఇం
టికిపోసినసొమ్ము దొంగిలించుకొని జూదమాడును. ముదుసలి వాండ్ర బట్టికొన్నను
తిని వారనష్ట పెట్టిండ్లుం జూపక విలాసవతుల విలాసములకు దగినట్లు దనసొ
గసుం తవలెనని తలఁచినపుడు మంగలిపని జేయించుకొనును. తానుప్రభు
వని దర్శనమునకు సజ్జనులు వచ్చినా లేచి మర్యాద చేయఁడు కూర్చుండుమన
ఁడు. అనుకూలయగు తనభార్యపై తప్పు లెంచి వదలిపెట్టినాఁడు వాఁడువి
ద్యావేత్తయగు గురువును వర్జించె. ఆప్తు చేసినచెప్పుమాటలలోని యప్పుతె
గబెట్టినాఁడు వాఁడు. వీఁడు తండ్రితనకు హితవులు చెప్పినా తండ్రిం గసరును
వాఁడు కోపమున సంపన్నుఁడయియున్నాఁడని యసూయపడును. వీఁడు తాఁదా
నమిచ్చిన వస్తువులు మరలఁబుచ్చుకొన్నాఁడు. పేదలకు మేలు చేయఁబోవువారి
కి అడ్డము పెట్టినాఁడు వీఁడు. శరణుజొచ్చిన వారికి ద్రోహము చేసినాఁడు. వీఁడు తల్లిని
తో సంధ్యావందనము గండూషజలంబులు నీటనుమిసె. అనియిత్తెఱంగున బ్ర
హ్మహత్య సురాపానగురుతల్పగమన సువర్ణస్తేయతత్సంగతాది మహా

పాపిసహితులను స్త్రీపతిశిశుజీవహత్యాద్యుపపాతకవిహితులను హ
రిహర పరాఙ్ముఖులను, అఖిల ప్రాణిహింసా పరాయణులను, వేద
బాహ్యులను, వ్యాధయవన పార్వతీయమ్లేచ్ఛచండాల చార్వాక
ప్రముఖ దుర్మతస్థులను భస్మరుద్రాక్షవిరహిత త్రిపుండ్రులను విశ్వాసద్రో
హులను, విశ్వాసపాతకులను, వేశ్వేరంజూపిత తత్కర్మంబుల చిత్రగుప్తుం
డు చిత్రవైఖరిని వినుపించిన నాలకించి సమవర్తి మండుచున్న యగ్నిపై
నాజ్యంబువోసినట్లు మండిపడి ప్రళయభైరవాకారుండై దీర్ఘనిశ్వాస
రోషభీషణుండై సందష్టదంష్ట్రాకరాళభయదాట్టహాసముఖుండై కుటి
లభ్రుకుటీతట నిటలుండై శోణదృక్కోణంబుల బ్రస్ఫురద్విస్ఫులింగంబు
లురాల, నొక్కపెడ నవ్వునవ్వి కొలువెల్ల భయంబంద ప్రచండకాల
దండంబు బ్రహ్మాండంబుబగుల నెగురవైచి పట్టిహృదయంబున సంగలుగు
కోపంబు మొగంబునగలుగ మొగంబుజేవురింప నప్పాపజాతులంజూచి
తలయూచి నిరంకుశ త్రిలోకభయంకర ప్రచారులగు తనపరిచారకులం
గనుంగొని యిట్లను ఇచ్చోటి సనాతనమహర్షిపుంగవుని యనుజ్ఞన
విజ్ఞానేశ్వరప్రకారంబున విధిజ్ఞులకుం దయాజ్ఞ వినుండని యము
డిట్లనియె.

గృహదాహకులంబట్టి నిప్పుమంటలలో బెట్టి కాల్పుడు గురుభా
ర్యాగాములనసిపత్రవనంబుల నుంచుడు. అంగంబుల నఱకుడు విద్యా
న్నకన్యా విక్రయులను యంత్రములలో బెట్టిత్రిప్పుడు. మద్యమాంసప్రి
యుల నంధకూపమునద్రోయుడు. నీతిమాలిప్రజల పాలించిన రాజుల
మంగలంబులంబెట్టి వేచుడు కొండెంబులు చెప్పినవారలం గొడవండు
లతో గంపలు చెండుడు. అబ్బులుకోయుడు శివద్వేషి నాలుకలుగోసివం
డుడు శివదూషణ విన్నపాపుల చెవులలోగాలిన శూలములు జొనుపు
డు శివునిమూర్తిని చూడనివారి కన్నులుకత్తి మొనలతో పొడువుడు
శివునిబూజింపని వారికరములు ఖడ్గధారల దెగగొట్టుడు. శైవాలయం
బునకేగని ఖలులబట్టి బెబ్బులులవాతంబెట్టుడు హరస్మరణచేయని ఖ
లుల జఠరంబుల సీసంబుగాచి పోయుడు పర్వతిధులందు నింద్యముఖుల

గూడిన దుర్మార్గులం జెనుబాములకోఱలం గఱపింపుడు. తగని మగువల
తో సంగమించిన తులువలంబట్టి కాలిన యినుపబొమ్మల కంటగట్టుడు
భ్రాతృమిత్రగురుబంధుల నిందించినవారిపై ననేకయుగముల దనుకం
బర్వతంబుల బడవేయుడు శివునకు మ్రొక్కనివారలం గుక్కలచే గర
పింపుడు. హరద్వేషులపై నేనుగులనెక్కించి త్రొక్కింపుడు లోభులం
బట్టి వజ్రదండపురుగులుగల బావులలో ద్రోయుడు. విశ్వాసఘాతుకుల
నుక్కుకొఱ్ఱుల నెక్కించి త్రొక్కుడు, వేదవిప్రద్వేషులంబట్టి కఱకుఱం
పాలచే దఱుగుడు అనృతవాదులను కండలు చెక్కుగు బాడిసెలతోడ
మహాకోపనుల దేహంబులు గాలకాలిన సున్నపురాళ్ళలో బడవేయుడు
జూదగాండ్రింబట్టి పగ్గంబులంగట్టి కఱకురాళ్ళ సోకవీధులం దిప్పుడు
సన్మార్గవర్తనులజూచి సహింపక తూలనాడిన పాపాత్ముల ముసలం
బులబట్టి తలలు పటాలున బగులగొట్టుడు పశువధచేసినవారి పొట్టలలో
సలసలగాగిన తైలముపోయుడు తప్పుసాక్ష్యము చెప్పినవారి శరీరము
నుండి చర్మమొలిచి యుప్పుసున్నమునూఱి పలుచగచేసి పట్టింపుడు మే
లొనర్చినవారికి కీడుదలంచువారిని నిప్పులగుండంబులం ద్రోయుడు. పర
కాంతల విరహంబునకు వేదననొందెడువారల మర్మంబుల నీతముండ్లం
జొనుపుడు కాలినసూదులు గోళ్ళలోను చేతులలోనుంపుడు. శరణాగతు
లరక్షింపని రాజాధముల భూతప్రేత పిశాచంబులకుం బలియిండు. గొ
ప్పవాఁడువచ్చినపుడు లేవకున్నవారిం బట్టి కాలినయినుపపెనాలపై ము
ఱలువెట్టగా గూలవేయుడు తల్లిదండ్రుల నన్నదమ్ముల దుఃఖపెట్టినవా
రిని మాటిమాటికి భల్లంబులం [illegible] గొట్టుడు చోరులపై రాళ్ళురువ్వుడు వ
ర్ణధర్మంబులం బరిత్యజించి [illegible] వెట్టుకొని తిరుగుదురాత్ముల
రాతిరోళ్ళలో బెట్టికుమ్ముడు పైతృకకార్యంబులొనర్పని వారింబట్టి ప
రిఘంబుల ఱొమ్ములంగొట్టుడు పెద్దవారల నుసురుపెట్టినవారియు సురు
గాలములచే దీయుడు ధనాపహారులం గొలుసులంబెట్టి తిత్తులూదుడు అ
తిథిపూజావిముఖులంబట్టి కాళ్ళు త్రాళ్ళంగట్టి నేరెడుకొమ్మలకు వ్రేలగ
ట్టి సందిన్నిగాల్చునట్లు కాల్చుడు భక్ష్యభోజ్యంబులందు విషంబువెట్టి ప్రా

ణాహాని గావించిన పాపులం గరళకూపంబులం ద్రొబ్బుదు కృతఘ్నులం బ
ట్టి యనేకకల్పంబులు మలమూత్రక్రిమికీట దుర్గంధకూపంబులఁ గూ
ల్చుదు. పల్లదంబులాడువారిని తోళ్ళప్రాకారలం బడఁద్రొబ్బుదు. పంక్తి
భేదంబుగావించినవారినోట విషంబులు వోయుదు ఉదకసమీపమున ను
రులొడ్డి మృగపక్షిగణంబులం బట్టి మ్లేచ్ఛులం బట్టి కత్తిబోనులం ద్రోసి
గండశిలలు దలలెత్తకుండ నెత్తుదు.

మఱియు నక్కరవిధంబులను బాపంబులాచరించిన పాపాత్ముల పా
పతారతమ్యంబు దెలిసి మదాజ్ఞోల్లంఘనంబుగాకుండ మీమీ నేర్పులు
మెఱయ వారివారికిందగిన, నరకంబులు, రౌరవంబును, కుంభీపాకంబు
ను, అసిపత్రవనంబును అనలలోహస్తంభంబును మొదలుగాగల దుర్గ
తులనిండ శోధించునెడ నిమిషార్థంబైన కాలూదినేరదేఱ నవకా
శంబీక యధికాయాసంబెట్టుచు, భూమియు సముద్రంబులు, గాలి; యా
కసము, సూర్యచంద్రులుండు నందాక జీవులజావకుండ నొప్పించుమని
భటకోటికిం జెప్పి నారకుల నొప్పగించియుం ప.

మఱియు వీరసేనుండను సేనానాయకుం బిలిచి తన నేత్రములముద్దు
టుంగరంబొసంగిన నతండు భయభక్తిపూర్వకంబుగఁ బుచ్చికొని దండ
ధరునకుం బ్రణమిల్లి శెలవందిచనియె. చనియతండు యమునియాజ్ఞ ము
ద్రాటికి కింకరులకుం దెలియంజెప్ప, అప్పుడా యమకింకరులు భూత
ప్రేతపిశాచగణంబులు, చెలరేగి కహాకహార్భటులు లోకంబుల కులంబు
నొందఁ బరశుపట్టిసప్రాసముసల ముద్గరతోమర దండగదాది సాధనం
బు లంకింపుచు బెదబొబ్బలిడుచు వెడవెడనవ్వుచు చెంగునందాటుచు
రింగునఁదిరుగుచు, నాడుచు బాడుచు, ముష్టిఘాతంబులం బాధింపుచు బె
ట్టురట్టడి గొట్టుకొనిపోయి తన్నగరదక్షిణ దిగ్భాగంబున నయోమయ
ప్రాకారబంధుర నవద్వారక వాటప్రపాటనంబుగాగదలి యందుబడ
ద్రోచిన చిరకాలంబు మహాఘోరనరకంబులం బడరాని యిడుమలం బడి
జీవులు బహుదుఃఖము లనుభవింతురు. అనవిని విస్మయ గతమానసుం
డై సానందమౌని జాలిగలిగి శివస్మరణంబు సేసి ధర్మప్రసంగుని కనె.

ఓమునిశేఖరా మీకు చెప్పిన గాథలు వినగా మనమున కింపుగా లేదు. కొందఱు సుఖించుటయేమి కొందఱు కష్టములందుటయేమి, శివుని కృపయట్టిలుండెనా, పుణ్యాత్ముల చరిత్రలు విన్న మీఁదట పాపాత్ముల కథలు వింటిని. పంచదారదిన్న వెనుక చేదు మ్రింగినట్లున్నది. కటకటా నిటలాక్షుండు దయాసముద్రుఁడే, కొందఱిని తీవ్రదుఃఖము బొందించెనే పాపము వారలు దిక్కు లేక శోకింపుచున్నవారు దీనులై యున్నవారిని బ్రోవకున్న మంచిదా, శివుఁడు, దీనదయాళుఁడు, సర్వదేవవిభుఁడు, సర్వకారణము, సర్వసాక్షి, సర్వమంగళదాయకుఁడు, సర్వవ్యాప్తుఁడు, ఆర్తజనత్రాణుఁడు, అనాథనాథుఁడు, అకారణబంధుఁడు దీనపోషకుఁడు కృపాంభోనిధియని, ఈశుఁడని వేదశాస్త్రపురాణేతిహాసంబులు దెలుపుచున్నవి. కావున నమ్మహాదేవుని నుగ్రహంబు లేమిం జేసియె పాపులు దుఃఖంబు నొందుచున్నారు. అమ్మహాత్ముని దివ్యమహిమ నరసింప నెవరితరంబు పూర్వము దేవతలు రాక్షసులు సుధకొఱకై క్షీరసముద్రమును, ద్రచ్చిరి. అప్పుడు సర్వలోకసంహారకారకంబై హాలాహలంబు పుట్టె, అంత దేవేంద్రాదులు శివుని శరణుజొచ్చిరి. శివుండు హాలాహలంబు భక్షించి లోకంబుల రక్షించె. సమస్తలోకంబులకు నేనే కర్తనని గర్వించిన బ్రహ్మశిరంబు ద్రుంచె యజ్ఞఫలప్రదుండగు తన్నెఱుంగక దూషించిన దక్షుం జంపె, ఎదురెవ్వరు లేక మదముతో త్రుళ్ళిపడుచున్న త్రిపురాసురుల సంహరించినాఁడు ప్రాణులను బాధపెట్టెడు మన్మథుని ఫాలాగ్నిచే భస్మము చేసినాఁడు సృష్టిస్థితిలయకర్తయగు దేవుండు రక్షించెదనన్నవాఁడని యాప్తవచనములగు చరిత్రములు పాపనాశకంబులు, భక్తలోకపాలకంబులు, కలిహరణంబులునగును మాకళత్రుచరిత్రలు కోరదగినవియు పాపంబుల బోద్రోలునవియు, రాజయోగాశ్రయంబులు, భక్తక్షేమకరంబులునగును, శంభునిసేవయు నామంబులును, శివస్మరణంబులు, వేదాంతవిహరణంబులు, ఘోరపాపహరణంబులు సంసారపారావారతరణంబులునగును శైవకథలు పావనములు దేవతాసంజీవనములు యోగిరక్షకములు శుభదంబులునగును. మఱియు హరుని కేలా

ఈవీక్షణములు నిగమార్థంబు బోధించును జగద్వీక్షణములు భుక్తి
ముక్తిప్రదంబులునగు జగంబేకార్ణవంబైనపుడు వైకుంఠంబ్రోవ మ
త్రీయమ్యో కాలునికివెఱచి తన్నుశరణంబుజొచ్చిన మార్కండేయుంగా
చె. లోకబాధకులయిన వ్యాఘ్రాసురాదులంజంపె. అఖిలామర్త్యులం
గాచి శరణాగత రక్షాబిరుదుచెల్లించె. ప్రళయకాల దాండవంబునం
జరణఘట్టనంబున బ్రహ్మాండంబు జూర్ణంబుగావించు నరకమునను
న్న జనులెప్పటికి సుగతినొందగ[illegible]న్నప్పటినుండి హృదయసంతాపం
బాఱదు కటకటా శంకరుండు [illegible]క్రింపడమ్యో కొందఱిం దుర్గతుల
కు కొందఱిని సద్గతులకుం బంపె. [illegible]కేమికలిగె. అతని లీలలేమని
చెప్పుదు కపటనాటక సూత్రధా[illegible]మ్యో అందఱం విస్మయానందమ
గ్నులంజేసినం దనసొమ్ముకొల్లవోవునె. ఓమహాత్ములారా యిప్పుడు నా
కొక యుపాయంబుతోచుచున్నది. మీరందఱు బుద్ధిమంతులు నావెం
బడిరండు. అనిన వారలిట్లనిరి. ఓమునిశేఖరా నీమనంబుననేమి తలచితి
వో, యదిమేము త్రికరణశుద్ధి నొనర్తుము మేము నీవారమైతిమి. అనిన
నతండిట్లనియె. యమపట్టణంబుననున్న పాపులజూడ వేడుకయ్యెడునేను
యమపట్టణంబునకేగి యముంగాంచి మాటలాడి నారకుల విడిపింపకు
న్న నాహృదయతాపముదీఱదు. కనుక జాగేలబోదము అనిహృదయం
బను పీఠంబున శివునింగూర్చుండబెట్టి నిర్మలభావంబను జలంబుల నభి
షేకంబొనరించి, సత్యంబను పీతాంబరంబర్పించి పుణ్యంబనే గంధమ
లంది, ధ్యానకుసుమంబునం బూజించి శమదమంబులను ముత్యాలహా
రంబులిడి, విశ్వాసమను ధూపంబువేసి విజ్ఞానమను దీపంబువెట్టి వైరా
గ్యమనుఫలంబు నివేదించి దాక్షిణ్యంబను తాంబూలంబిచ్చి శాంతియ
ను ఛత్రంబువట్టి, హరా, పరమేశ్వరా, యాపర, పార్వతీమనోహ
రా, నిఖిలాండనాయకా మహాఫలదాయకా విష్ణుబాణా, సురవరార్చి
త పాదపద్మా, శూలవిదారితారియని స్తుతించి నిమీలితాక్షుడై తల
చె. అపుడు మహాప్రభావిలసిత రత్నమయకాంచన దివ్యవిమానంబొ

క్కటి యాకసంబునుండివచ్చె. దానింజూచి మునులంద అద్భుతంబం
దె. యానానందు సభినందించి యతని యనుమతిం బుష్పకంబతనితో
నెక్కెరి. ఇట్లమ్మునులంగూడి పుష్పకంబెక్కి వేణువీణా గానంబులు
ను మంగళతూర్యఘోషంబులును శివదూతపాఠక ఘోషంబులును జె
లంగ మునిపురంబునకుం జనుచుండె. అక్కడ సకలధర్మాధర్మ వి
దులైన మౌనులు పరివేష్టింప, వలసిన పనులుచేయ యక్షపన్నగగరుడా
దులుండ మనోహర గానంబుపాడుచు గంధర్వులగ్రభాగమునఁగొల్వ
కంకణంబులు గల్లుగల్లున మ్రోయగా జారణాంగనలు వింజామరలువీవ
ముత్యాలమండపములో రత్నసింహాసనంబున యముండుకొలువై యుం
డె. అపుడు కెంపులదులకింపు నెట్టని కాషాయవస్త్రంబును తళతళలా
డు మెత్తనిజింకతోలెడమవైపున నొప్పతెల్లనిజన్నిద మ్ముప్పగళమున
రుద్రాక్షమాలికలు మెఱయంగమ్మని వీణారవమ్ముమెలగ జపసరమును
కుంజికయుదాల్చి నారదుండువచ్చి సింహద్వారంబు చెంతనిల్చె. ఆవా
ర్తవినివైవస్వతుండు సత్వరంబుగ నెదురేగి సాష్టాంగవందనం బాచ
రించి పూజించి తోడితెచ్చి యొక్కరత్నాసనంబుపై గూర్చుండబెట్టి
యిట్లనియె.

మహాత్మా మీరునాయింటికి విచ్చేసితిరి. శుభంబుగలిగె పవి
త్రుడనైతి. నాకోర్కెలీడేరె. నావిని నారదుండు ధర్మరాజా నీకు సేమం
బేనీకుత్తిన్నా బాగున్నది. నీమిత్రులకులగ్గ ముమిత్రులకుం కుశలంబె. య
నినస్వామీ మీదయచే నేలోపంబునులేదు దేవరవారు లోకంబులం
గుత్రిమ్మరుచుండ్రు విశేషంబులెవ్వయేని కనియుందురు. తెలియంగోరెద
నానతిండనియె అనిన నారదుండిట్లనియె. శివభక్తశిఖామణి సకలనిగ
మాంతవిదుండు వ్యాసముద్రుండు శంకరమంత్రసిద్ధుడు సానందుడను
యోగి కోటిసూర్యప్రభల నొప్పారుదివ్యవిమానంబెక్కి రాగలంబు వ
చ్చినిన్నదర్శించి నీతో మాటలాడి తనమాహాత్మ్యం దీపురంబునంజూపి
నారకులనెల్లంగని కనికరించి వారలబాధలు శమియింపంజేసి వారిని శి
వసాలోక్యంబు నొందింపంగలండు. నీమేలుగోరి చెప్పితిని, నామాట

యుండు నీకు బాటియేని యుపాయంబున నగరంబుపాడువడకుండ నాలో చింపుము అనిన జిఱునవ్వునవ్విన తనయుండు కలహాశనముని గనుగొని మీరాడుమాటలు చిత్రంబులుగావు. సానందుఁడా వినుము ఈనారకుల నెల్లబాధలవలన దప్పించి కైలాసంబుచేర్చుటెట్లు. ఈతనిపాటి యోగులు భూమిపై నిలేరె, వింధ్యపర్వత గర్వంబణచిన యగస్త్యునికంటె, అరకాలగన్నకన్న గౌతమునికంటె, త్రిమూర్తుల ప్రాశస్త్యంబు దెలిసిన భృగువుకన్న బ్రహ్మనెదిరించి ప్రతిసృష్టిచేసిన విశ్వామిత్రునికంటె, సగరుకుమారుల బూడిదచేసిన కపిలునికంటె, ముక్కునకోపముగల దుర్వాసుకంటె నీతనిమహత్వమెక్కుడా, మాండవ్యుడు, శాండిల్యుడు శౌనకుడు కాశ్యపుడు, మార్కండేయుడు మొదలగు మహాతపశ్శాలులు లేరా అందఱేల, సనకాదులును మీరును బ్రహ్మకుమారులై సకల జగంబులం బ్రసిద్ధులైయుండ మీకంటె గొప్పవాడా, మిమ్ముంగాదని వాదింపనోప, ఇప్పుడు చెప్పిన ఋషులు తపసుం దీసిపోదురె. మీరు విచిత్రంబుగఁజెప్పెదరు. సానందుఁడా వినుము. వచ్చి పట్టణంబుం జూచివచ్చినదారి నెపోగాక. అంతియెకాని యతడేమి చేయజాలు. ఇన్నాళ్ళనుండి చూచుచుంటిమి. ఇట్టివింత లెన్నడయిన బుట్టినవె. శివునియునుగులాన. ఎండమావులలో నీరుగనవచ్చు. శేషునెక్కిన జేయవచ్చు. బూడిదెలోజమును దీయవచ్చు. అగ్నిజ్వాలలు ద్రావవచ్చు దామరతూండ్లతో బంతిగట్టవచ్చు పర్వతంబుల నెగురవేయవచ్చు. కానిపాపాత్ముల పాపంబులుపాపి మా పార్వతీపతిలోకంబు చేర్చుటదరంబుగాదు. దేవుడిచ్చినపదంబు దీసివేయుట. బూడిబొట్టుం బెట్టుకొనుటగాదు. ఆయువుమూడిన వారింగాని ప్రాణంబులు తీసికొనిరాను. నాకడనన్యాయంబులేదు. మీరెఱుగరా ధర్మరాజని పేరెట్లుకలిగె: పుణ్యాత్ములైనం బాపాత్ములైనం బట్టినాదూతలు తెత్తురు. పుణ్యంబుపరిశీలించి యుత్తమలోకంబులకుంబుత్తు. పాపకార్యంబులం జేసిన పాపాత్ములంబట్టి నాదూతలు నానావిధనరకంబులంబడద్రోసి తత్తత్కర్మఫలంబుల నారకులననుభవింపజేయుదురు. కావున నారాజ్యవిభవంబు నాశంబునొందింప శివభక్తుండు సిద్ధునితరంబుగాదు. అతని

కిశివభక్తి యీవిధంబుగఁదలకెక్కెనో తమకుఁ జేతఁగానిపనులకుం జలపట్టి
పూనిరేని హరిశ్చంద్రుఁడయిన ఁబగఁగొన్న విశ్వామిత్రునట్లగుదురు. అనిన
నారదుండెవ్వరేఁగతిఁబోయిన నాకేమని లోనఁనుకొని దబ్బరలేచియమున
నుమతింగొని యథేచ్ఛంజనియె.

అంతట సానందుండెక్కిన విమానరాజంబుజ్జ్వలత్ప్రభా విభాసిత
దిగ్విభాగంబయి యేతేరంబోవులు గుంపులుగూడి చూచి నారదుండుచె
ప్పినట్లు నిక్కంబుగ నిదె పుష్పకంబు రమశేయమశేవింపితంబయి యొ
ప్పెడు. అతఁడాడినమాటదప్పనెట్లు. ఇది యీసానందుని విమానంబుగా
దేని యిక్కడివిమానంబులకిట్టి పొంకముగలదె. ఈమహాత్ముని రాకయి
క్కడివారికి మేలురాకయగు నారకుల కష్టంబులు నేఁటితో గట్టెక్కెను
సందియంబులేదు. మనమాతని దర్శించి మనపాపంబులు నీగుదమని యా
డుకొనుచుండ దండధరకింకరులువచ్చి యముంగాంచి సానందుండు వి
మానమెక్కివచ్చెనని వాకొచ్చిరి. ఇట్లువినఁగనే శమనునకు మునుపటి
బింకేమును, గర్వమును, ధైర్యమునణగెను. కంపమును, భయము, వి
స్మయముఁగలిగె, కింకరులతోడను సభికులతోడను కక్ష్యాంతరంబులు దా
టిచని సానందుని నానందంబుసంగిని తద్దివ్యసుందరవిగ్రహంబునకుఁద
త్తేజోమహిమకు సత్యద్భుతంబంది సాష్టాంగనమస్కారంబాచరించి కే
లుమోడ్చి, శరణుదయాసముద్రా మునివినుతా. చిన్మయశంకరమంత్రజప
కారణమ్ముద్రి, మీచరణంబులాశ్రయించెద. నన్నుంగరుణింపుము. మీపద
జలజసందర్శనంబుం గృతార్థుండనయితి. నాపూర్వపుణ్యంబునండె. పి
చ్చుకకుంటుమీఁదంగంగాప్రవాహంబువచ్చినట్లయ్యె. నన్నుంధన్యుంజే
యనెంచియె మీరువిచ్చేయుట. వచ్చి పోయిల్లుచూచి నాపూజలంగీకరిం
పుడు. నావుడు సానందుండు కృతాంతుని సంభాషణంబులకు సంతోషిం
చి మునులుందానును విమానంబుడిగ్గి యమునికయిదండబూని నడుచు
చు యముని వినయమునకలరి కక్ష్యాంతరంబులు గడచి చని యముని
కుశలంబడిగి దీవించి లోపలకతనితోడంజనియె. యముండును సానందుం
నున్నతరత్నపీఠంబున గూర్చుండబెట్టిన భక్తికంబుగంబూజించి దక్కం

గలమునులసర్వాసనాసీనులం జేసి పూజలుసల్పె. అపుడు సానందుండా
నందంబునం దద్ధర్మనందనుం దిలకించి యిట్లనియె. ఓయీ ధర్మరాజా నీని
ర్మలగుణంబులు మునీంద్రులు చెప్ప విని నిన్నుజూడవచ్చితి. చూచితిని. నీ
వినయాది సద్గుణంబులకు మెచ్చితి. నీపూజలన్నియు గౌరీశుండంగీకరించె.
పెద్దలయెడ భక్తి గలిగి పూజించుట సజ్జనలక్షణంబు. కోపప్రసాదంబు
లు రాజులయెడ సహజంబులు పెద్దలయెడం గోపంబుగలవారయ్యెనేని
యెట్టిభూపాలుండయినం జెడు రాజసతామసంబులు, గలుగుటవలనవర్తి
లు రాజులకడ తారతమ్యంబులుండునె. రాజగుణంబుగలిగి నీతిదక్షక
దిక్పాలురు మెచ్చునట్లు రాజ్యంబు చేయుచున్నావు. ధర్మరాజను పేరునీ
కుదగును. అనినధర్మరాజిట్లనియె. అనఘా భవచ్చరణరేణువులు సోకిన ధ
న్యుడనయితినని మరలమ్రొక్కి యయ్యా మీరు హరునివామాంశంబున జనిం
చితిరి. మిమ్ముంబొగడ నింద్రాదులకశక్యంబు. నన్నొక పెద్దగా జేసి యిట్ల
నియెదరు. నేను దొలిజన్మంబున శంభునారాధించియుంటి. తత్పుణ్యం
బు ననేడు మిమ్ముం జూడగంటి తమరేపని మీఁదవచ్చితిరి. చెప్పుమన్న
నతండిట్లనియె. సమవర్తిమ గేమియు లేదు నిన్నును నీపురంబు జూడగు
తూహలము గలిగి వచ్చితిని నిన్ను జూచితిని నీమహిమ జూచితిని నీప
ట్టణము చూడవేడుకయ్యెడు రమ్ము. నావుడు యమసుతుడు విని విన్నదనం
బుగలిగి లోలోగిన్కపూని యోహో నారదన్నట్లయ్యె ఈముని యూపు
రి పాపు వడజూచెనే పిలువని పేరంటమునకేల వచ్చె నితడు "కార్యము
దప్పినది నారదుడు వచ్చి యితని రాక చెప్పినపుడు నరకు గొననయితిఅ
ప్పుడె శంఖునకె తెంగించిననిది తప్పమార్గంబానతివ్వడె బుద్ధిమో
స మయ్యె మనమాటలు సాగవు తపస్వుల యాలోచనలు వృథయగు
నా నేనే వెర్రి యోచనలను జేసితినేని నలుగురు నగుదురు. ఈతనికేరీతి
నుత్తరమిత్తును ఏమియు దోచదు మనస్సునకుం జింత గలిగెడు మహా
మునులు త్రిమూర్తులనయిన నతిక్రమింతురు. తాపసులకోపప్రసాదం
బులం మేరువు తృణముగను తృణము మేరువుగను జేయ జాలుదురు
కరుణ యెంత సులభంబయియుండు కోపంబునట్లెయుండు. వీరలెట్టివిధం

బుల జీవులకుపచారంబు జేయంజూతురు వీరికివ్యతిరేకప్రవర్తనులపయి
కోపంబు గలిగి శపింప జాలుదురు. అప్పుడచ్చటనున్నవారందరు దేవేంద్రుని
సంపదలెల్ల సంద్రంబు పాలుగాఁజేసి యొకడు నూఱుయజ్ఞంబులు చేసిన
నహుషునింగొండచిలువగమ్మని శపించె, మహాశూరులు పెక్కండ్రను
నొక్కడుబూదిచేసి సత్యవాక్యపరిపాలన దీక్షాదక్షుండు నొక్కకడునీ
చసేవవాన్ని చెకావునం దేనెబారునట్లుచక్కెరయొలుకునట్లుపలికిరనిము
నులనమ్మరాదు స్త్రీతోడి చెలిమి సింగంబుతో జెరలాటమట్లుండు. ఇంక
పెక్కుదలంపులేల యతడు చేసినట్లుయొప్పెదనని నిశ్చయించియముండ
యాపురంబలంకరింప నాజ్ఞయిచ్చెద పిమ్మటం జూడండగు ననిన ముని
యు వల్లెయనియె. అంతశమనుండు కింకరులంజూచి పట్టణంబు తత్క్ష
ణంబ యలంకరింప జాటింపుడనియె. వారట్లొనర్చిరి. అప్పుడప్పురంబు
గల యంజిమ్మియగుర్వాది ధూపంబులిడి పన్నీటంగల యంజల్లిముత్యా
లముగ్గుపెట్టిరంభా క్రముకస్తంభంబులు నాటి యలంకరించిరి. అనంత
రంబంతకుండు సానందునిందఱస్వులను వెంటబెట్టుకొని కింకరులు గొల్వ
జిత్రగుప్తునిందోడ్కొని పట్టణంబు చూడ బయలి వెడలి వీధి వీధులం
జూపుచు నండలివిశేషంబులం దెలియంజెప్పుచు జన్ని, చని సానందుం
గని యిట్లనియె.

అదెయాగంబులొనర్చి సోమయాజులై మహాసాధనీములనున్న
వారింజోడుము హేమరంభాస్తంభ విజృంభితులై యొప్పెదు నదిదా
తలుండుచోటు మాణిక్యరత్నమయాలయంబది, గురుభక్తులు, విశ్వాసప
రులుండుచోటు ముత్యాలతోరణంబులుగల యిలువరుస సత్యభాషణు
లుండుచోటు, మృదుగీతంబునుం బద్మశ్రేణియుఁగలదిహారిహారసమబుద్ధు
లుండుచోటు మద్దెలలు తాళములుగలిగి నాట్యంబు గలిగియుండెడు
ఇల్లుదానధర్మములు చేయువారుండునెలవు. అందమగు నరదంబులం
దు నున్నతములగు తురగములపయిని మత్తగజంబులపయిని యందమౌ
నందలంబులందు నెక్కితిరిగెడు పుణ్యాత్ములంబురందర సదృశులంగం
టె? ఇట్లాదరంబుపెంపున నాదండధరుండు పట్టణంబెల్లజూపుచు విశేషం

బులు చెప్పుచు కూడవంటివచ్చుచున్న యమునింజూచి సానందుండానం
దింపుచు జనుచుండె. వానింజూచి పౌరస్త్రీలు హర్మ్యాగ్రంబులెక్కి
యిట్లనిరి. సకలలోకంబులు సృజించుబ్రహ్మయో, జగంబులంబాలించు
విష్ణువో, లోకములెల్ల లయంబునొందించు కందర్పవైరియో, మూడు
మూర్తులకు మూలంబగు పరబ్రహ్మంబో, కాదేని యీయముండితని
కిట్లు సేవజేయనేల. నారదుడుచెప్పిన సానందుడయగుననిశూలంబుగే
లంబూనలేదు చర్మంబుధరియింపడయ్యె. కంఠంబునం గరళంబులేదయ్యె
నిటలంబునం ధనంజయాంబకంబులేదయ్యె. పాపభూషణంబులులేవు సా
రంగంబుంబట్టుడు కానిశివుండె సానందుండై భువింబుట్టి చరింపుచుండె.
అనిమఱియు నోచెలియా యితడే శివపూజాధురంధరుండు. ఇత
డే నారకులదుఃఖంబులు వోగొట్టజాలిగలిగి వచ్చినవాడు. ఇతడాగురుభ
క్తివిశ్వాసములు గలవాడు వేదవేదాంగవిదుడుపిడా, వీడాసర్వజ్ఞునికు
లచక్రవర్తి. అనుచు ముత్యాలతలంబ్రాలు జాలకంబులనుండి, పౌరప
ల్లవాధరులు చల్లుచుండిరి. ఇట్లుపట్టణంబు తిరుగుచు వినోదంబులువీక్షిం
పుచు సంతోషింపుచు యమునింగనుంగొని సానందుండిట్లనియె. ధర్మ
రాజా నీపురంబు జూడంజూడ దనివితీరదు. చూచినదె మరలంజూచినట్ల
గు అట్లగుటకు గారణంబు దెల్పుమన్నం గృతాంతుండిట్లనె. మహాత్మా
యీనగరివిశేషంబులంజెప్పెద సావధానులరై చిత్తగింపుడు. ఇమ్మహా
పట్టణంబున సకలధర్మాధర్మ విధినిషేధ ప్రాయశ్చిత్తమని దూషణంబుల
కాదికారణుండగు సంయమిజనంబు లుండుటంజేసి యీపురంబు సం
యమనీనగరంబను నభిధానంబునం బ్రసిద్ధంబయ్యె.
పూర్వపశ్చిమోత్తర దక్షిణదిగ్భాగంబుల మరకత సువర్ణాదు
ర్వర్ణాయఃపరికల్పిత వర్ణంబులు దేజరిల్లు, దత్తత్సింహద్వారంబుల నా
లుగుగోపురంబులు ప్రకాశమానంబులై వెలుంగుచుండు నదియునుం
గాక యప్పాటి లకుయుందొమ్మిదివేల ప్రధానద్వారంబులు నొక్కొక్క
కోటి ముందర నొక్కొక్కగోపురంబును నలరారు నాలుగులక్షల బ
దాఱువేల రాజమార్గంబులును డెబ్బదిమైదువేల శివాలయంబులును

విష్ణుస్థలంబులునుగలిగి దశసహస్రకోటి వీరకింకరుని కరంబుచేతం బరిపా
లితంబై రాజిల్లు నీరాజధానికి బశ్చిమదిగ్భాగంబునం గోటిసూర్యప్రకా
శమానంబై దగఢ్ఢగాయమానకనత్కనక గోపురంబుగలదని యచ్చ
టికి సానందుం దోడ్కొనిచని యచ్చటి పురుషులంజూపి వీరలు సకలధ
ర్మస్వరూపులు దేహాంతంబున దేహంబులువిడిచి సుకుమార దివ్యమం
గళవిగ్రహంబులుగైకొని దివ్యవిమానంబులెక్కి మదీయకింకరు ల
త్యంతసంభ్రమంబునం బరిచర్యలొనర్ప విద్యాధరగంధర్వకామినీ జ
నంబులు తానమానంబులు వినుపింప దివ్యవాద్యంబులు మొరయంబ
రమోత్సవంబున మహనీయగోపురంబుసొచ్చి యచ్చటబంగరుమేడల క
ల్యాణమంటపంబుల జంద్రకాంతవేదుల చంద్రశాలలను హైమసో
పానభాసిత కాసారతీరంబుల దివ్యాప్సరోస రోజలోచనలతోడంగూడి
క్రీడింతురు. అనినసానందుండానందంబునం దపననందనా వీరలుధారుణి
నేపుణ్యంబులొనర్చిరి చెప్పుమనిన నతండిట్లనియె. వాపీకూపతటాకం
బులనిర్మించినవారు. దానధర్మము లొనర్చినవారు. విద్యావంతులు స
త్యభాషణులు ధైర్యశాలులు పితృతర్పణతత్పరులు నిత్యనైమిత్తిక య
థాకాలకర్మపరులు వీరుయుద్ధంబున వెన్నియ్యకనిల్చిపోరి హతులైరి. ఇ
తడు కఱవుకాలంబున ధాన్యముగొని కొన్నధరకమ్మించిన పుణ్యాత్ము
డు బీదలకప్పిచ్చి న్యాయంబుగ బుచ్చుకొనువాడితండు శత్రువులకైనను
పకారంబొనర్చు పరుల నొవ్వబలుకడు. ఇతడు తనకున్నంతలోన బరు
లకన్నపానాదులిచ్చు. వీరుపూజ్యులం బూజించి యాశ్రయించినవారు
వీరుమిత్రులం గాపాడినవారు వీరలు యజ్ఞంబులొనర్చినవారు, వీరుసమ
స్తభూత దయారతులు వీరుహరిహర పురాణకథలు విన్నవారలు వీరు
శివపూజాపరులు వీరలేకపత్నీవ్రతులు వీరలు శివాలయంబులూడిచి జల
ముచల్లి, శివపూజకుం బూవులుదెచ్చిన మహానుభావులు వీరుకొల్లాపు
రము కుంభఘోణము, కమలాలయము, వృద్ధ కాశి చిదంబరము, కాశి
గోకర్ణము కాంచీపురము శ్రీశైలము వేంకటాచలము కాళహస్తి
యహోబిలము, ఆదివరాహము, రామేశ్వరము శ్రీరంగము అరుణాచ

ఈనారీరత్నంబులు విమలపతివ్రతాత్వ మహాత్మ్యమున దేహావ
సానమున దనువులువదలి దివ్యశరీరలై దివ్యగంధమాల్య దివ్యాంబర
భూషణధారిణులై దేదీప్యమానంబులగు విమానంబుల నెక్కి గరుడగం
ధర్వ కిన్నరాది దేవతావనితలు చామరధ్వజవ్యజనంబులువీవ మహా
వైభవంబునం దమదమపతుల సద్గతిబొందకుండ నుద్ధరించివచ్చి యు
చ్చటగలుగు రాజతప్రాసాదంబుల రజతమంటపంబుల సుందరమందిర
ములంగాపురంబులు సేయుచు, సుగంధబంధుర కమలవిలసిత జలాకరం
బుల జలక్రీడలాడుచు మృదులతాంతశయ్యల బవళింపుచు ఉద్యానం
బుల విహరింపుచు గలకంఠ, శుక, శారికాదికలస్వనంబుల కలరుచు కు
సుమితలతారాగంబుల నివసింపుచు, దీగెయుయ్యెల లూగుచు, గాశ్మీర
కర్పూర, పాటీరహరిద్రా పంకసంకలితగాత్రశోభితలగుచు, సిద్ధవిద్యా
ధరాది కాంతలతో నృత్తములాడుచు, వేణువీణా వినోదముల మోదిం
పుచు ప్రాణవల్లభులం బంచ భల్లకిక్రియాకలాపంబుల, గాఢాలింగనంబు
ల, మధురాధర సుధాపానముల దశవిధచుంబనంబుల, చిత్రబంధంబుల,
గరంచిమెప్పింపుచు నివ్విధంబునం దిరమగు సుఖానందం బనుభవింపు
చుం బతుల మన్మథసామ్రాజ్యం బేలింపుచు నిచట నుందురనిన సానం
దుండై వీరలేమేమి పుణ్యంబులొనర్చిరి చెప్పుమనియె, దీనిభర్త - మ
హాపాపి మృతినొందనిది యతనితో సన్నిజాచ్చె. దీనిపాతివ్రత్య మహి
మం జేసి మదీయకింకరులు భీతులై, దీనిభర్తం దెచ్చిరి. స్త్రీలకు భర్త
మృతుడైనపుడు సహగమనంబు చేయుట యుత్తమధర్మంబు స్త్రీలెల్లొ
నర్చిరేని మగనివంశంబు వారిలో పదునాల్గుతరములవారిని, బుట్టింటివం
కవారిని నేడుతరములవారిని సద్గతికిం బంపగలుగుదురు. యీపతివ్రత
లచరిత్రలు గొంతవరకుం జెప్పెద జిత్తగింపుము. పురుషుడెగ్గినను మన
మునకైనుకనొందదు. మిత్రులు, పుత్రులు బంధువులు వలదన్నను మాన
క సహగమనంబు చేయును. భర్తను మనస్సున నిల్పి నుండెడు సన్న
లోనుఱుకును. అట్టివారలువీరు కలలోనైన పరపురుషు మాట జవదాటక
మగనిని దైవముగ దలంచి, మగడుడన్న [illegible]

ఈనారీరత్నంబులు విమలపతివ్రతాత్వ మహాత్వమున దేహావసానమున దనువులువదలి దివ్యశరీరలై దివ్యగంధమాల్య దివ్యాంబర భూషణధారిణులై దేదీప్యమానంబులగు విమానంబులనెక్కి గరుడగంధర్వ కిన్నరాది దేవతావనితలు చామరధ్వజవ్యజనంబులుపూన మహా వైభవంబునం దమదమపతుల నధోగతిబొందకుండ నుద్ధరించినచ్చి యుచ్చటగలుగు రాజతప్రాసాదంబుల రజతమంటపంబుల సుందరమందిరములంగాపురంబులుసేయుచు, సుగంధబంధుర కమలవిలసిత జలాకరంబుల జలక్రీడలాడుచు మృదులతాంతశయ్యలం బవళించుచు ఉద్యానంబుల విహరించుచు గలకంఠ, శుక, శారికాదికలస్వనంబుల కలరుచుకుసుమితలతారాగంబుల నివసింపుచు, దీగెయుయ్యెల లూగుచు, గాశ్మీర కర్పూర, పాటీరహరిద్రా పంకసంకలితగాత్రశోభితలగుచు, సిద్ధవిద్యాధరాది కాంతలతో నెత్తములాడుచు, వేణువీణా వినోదముల మోదింపుచు ప్రాణవల్లభులంబంచ భల్లకిృయాకలాపంబుల, గాఢాలింగనంబుల, మధురాధర సుధాపానముల దశవిధచుంబనంబుల, చిత్రబంధంబుల, గరంచిమెప్పింపుచు నిర్విఘ్నంబున దిరమగు సుఖానందం బనుభవింపుచుంబతుల మన్మథసామ్రాజ్యంబేలింపుచు నిచట నుందురనిన సానందుండు వీరలేమేఖి పుణ్యంబు లొనర్చిరి చెప్పుమనియె, దీనిభర్త మహాపాపి మృతినొందనిది యతనితో నగ్నిజొచ్చె. దీనిపాతివ్రత్య మహిమం జేసి మదీయకింకరులుభీతులై, దీనిభర్తం దేసైరి. స్త్రీలకు భర్తమృతుడైనపుడు సహగమనంబుచేయుట యుత్తమధర్మంబు స్త్రీలట్లొనర్చరేని మగనివంశంబు వారిలో పదునాల్గుతరములవారిని, బుట్టింటివంకవారిని నేడుతరములవారిని సద్గతికిం బంపగలుగుదురు. యీపతివ్రతలచరిత్రలు గొంతవఱకుం జెప్పెద జిత్తగింపుము. పురుషుడల్లినను మనమునకినుకనొందదు. మిత్రులు పుత్రులు బంధువులు వలదన్నను మానక సహగమనంబు చేయును. భర్తను మనస్సునసనిల్పి మండెడు వహ్ని లోనుఱుకును. అట్టివారలువీరు కలలోనైన మగనిమాట జవదాటక మగనిని దైవముగదలచి, మగడుడన్న పిమ్మట మిగిలినది ప్రసాదమని భో

క్తితో భజించి పరపురుషుల దలయెత్తిచూడక, మగనిపై నలుకనొందక
క, మగనితో నెదిరించి మాటాడక, బంధుగులకు కలకొలది నుపచరిం
పుచు. మగనిమనసు నెరిగి మెలగుచు, నిరుగుపొరుగింతులకుబోక సకల
జనులు దన్నుం బొగడునట్లు వర్తించి భర్తమృతుండైన యనలజ్వాల
లంబడిన పడతుకలుసుమీ వీరు వీరలు, మగల మామల న త్తల నన్న
ల దమ్ముల బిడ్డల నొవ్వబల్కక మనసు కెక్కునట్లు గొలిచి యాదరించి
పరిచర్యలు జేసినవారు పతులతోడి సంగమకాలంబునందక్క మేలంబు
లాడనివారు, వీరుభర్తకు ముందారగింపరు, పెనిమిటి నిద్రించిన వెనుక
నిద్రించి భర్తకుముందె లేచువారు. కోపమును విసుగును లేక భర్త
కు పరిచర్యచేసినారు కలిగినకొలది సింగారంబు గావించికొనక పెనిమి
టి యెదుటికిరారు. తనప్రిజలు భర్తవద్దపలుకరు. దమనుడువడికంబట్టి
మగల కసూయత కలుగనీరు. సొమ్ములేదది లేదదిలేదని, భర్తను
ఆయాసపెట్టరు. భర్తపరదేశమేగెనని యతనిరాకగోరుచుంద్రు. అలం
కారముచేసికొనరు. అతడు వచ్చెనన్నవార్త వినగనే సంతోషముతో
నెదురేగి తోడితెచ్చి పీటవేసి పదంబులుగడిగి కుశలప్రశ్నంబుగావించి
యలతదీర్చి వేగిరమువంట జేసి స్నానంబాడించి మధురపదార్థంబు లి
ష్టంబులగునట్లు భుజింపంబెట్టి తాంబూలంబిచ్చి పక్కసవరించి యతడు
శయనించిన పిమ్మటం బదంబులొత్తి, భర్తసేవజేసిన వనితలువీరు. మ
గని సంతోషమే తమకు సంతోషముగను మగనిదుఃఖమె తమకు దుః
ఖముగను వర్తిల్లినవారువీరు. వీరలు తమమగల సఖులబూజ్యులనియా
దరించినవారసుమీ, పురుషుడాచరించినవ్రతములే యుత్తమవ్రతము
లని సమ్మతించిన వారువీరు. అతనిపలుకులు వేదాక్షరములని చరియిం
చు చెలులువీరు. భర్త కోపించినప్పుడు తామునలుగక భర్తమంచం
బునొద్ద క్రిందబగుండి పెనిమిటి కరుణించి పిలిచినప్పుడు దరిజేరిన సారస
ముఖులువీరు, ఋతుమతియైన నాలవనాడు స్నానమాడి చలువవలువ
గట్టి మగనిమొగము గనక మునుపు పరులజూడని మగువలువీరు. మగ
డు పరస్త్రీనక్తుండైనను అప్రియంబులుపలుకక, యెప్పటియట్లు వర్తిం

వృచు, నుండువారుపీరు వీరలు, కార్యంబుల మంత్రులవలెను, కరణం
బుల దాసీలవలెను, భోజనంబు బెట్టుటలో, దల్లులవలెను, శయనంబున
రంభలం బోలి భర్తలయెడ వర్తించినవారు. వీరలు గౌరీవ్రతములు
లక్ష్మీవ్రతములు, సరస్వతీ వ్రతములు లోనగు వ్రతములొనర్చినవారు.
వీరలు శివాలయంబుల నూడ్చి యలికి పలువిధంబుల ముగ్గులుపెట్టి య
లంకరించినవారు. వీరలు సర్వ మంగళా ప్రియుండగు శివుని సహిత మం
గళహారతులిచ్చి మంగళములు పాడినపుణ్యాంగనలు అని యిట్లు పతివ్ర
తలగు స్త్రీలంజూపి యచ్చటు వాసిపూర్వదిశ కరిగి యచ్చట సహనీయ
సువర్ణ ప్రభాచకచ్చిత కాంతి సంతాన సంతురద గింత్యంబగు త్రివి
క్రమా వతారుండయిన విష్ణు నయిభవంబున విష్ణుపదంబనంగుచు స
కల కళాపరిపూర్ణంబయి బ్రహ్మాండంబు భాతినొప్పుచున్న పూర్వగోపురం
బుంజూపి యచ్చట విహరించు పుణ్యాత్ములం జూపి వీరలు జనులు మ
రణ కాలంబున మోహబంధనలందెగగోసి మోహన దేహంబులు ధరి
యించి సువర్ణ కిలిత సర్వాభరణ ధారులయి పీతాంబర పరిధానుల
యి సుగంధంబులందని జ్వాంగిదీప్తులు దిశల నెలుంగ మహోత్సాహు
లయి దుందుభి ముఖర వాద్యంబులు చెలంగ విమానారూఢులయివైకుంఠ
మ పదంబునవచ్చునపుడు సిద్ధ విద్యాధరాద దేవ తాస్త్రీలెదుర్కొనుచు
నూడిగంబులొనర్ప నానందింపుచు నిమ్మహాగోపురంబు సొచ్చి వచ్చుచు
నిచ్చట విశాల రత్నమయప్రాసాదంబుల భోగంబులనుభవింపుచు దేవ
తా వనితలతో క్రీడింపుచు సుఖంతురనిన సానందుండు విస్మయ ప్ర
మోదంబులు గలిగి వీరలెవరెట్టి పుణ్యంబులొనర్చిన వారు చెప్పుమనిన
శమనుండిట్లనియె. అరుణోదయము కాకమునుపే నిద్రలేచి త్రిమూ
ర్తులం దలంచి భగవద్భక్తుల జేర్కొని పుణ్యతీర్థంబులను బుణ్యక్షే
త్రంబులను సంస్మరించి సీతా ప్రముఖ పతివ్రతల వినుతించి భాస్కరా
దుల గొనియాడి విహిత కర్మలనుష్ఠించి పవిత్రులయి పాపంబులం బా
యంబోలిన వారు వీరలు. వీరు కార్తీక మాఘమాసంబుల ప్రాత
స్స్నానం బొనరించినవారు. వారు చాంద్రాయణ కృచ్ఛ్రాది వ్రతంబుల

చరించిన వారు వీరు సదోపవాసవ్రతనియతులు వారు పెద్దలయిన తలి
దండ్రులకు భక్తితో శుశ్రూష చేసినవారు. వీరు సత్య వ్రతపరాయణులు
వారు సుశీలంబుగలవారు వీరు స్త్రీలకు మర్మమియ్యనివారు. వీరలు దై
వబలంబుగలుగు వారు వీరలు భాగీరథిం గ్రుంకినవారు, వారు గౌతమి
లోను, వీరు కేతకిలోను వారలు యమునలోను వీరు ప్రయాగలోను వారు కా
వేరిలోను, వారు నర్మదయందు గ్రహణంబుల సంక్రాంతులందును బ్రతిదినంబ
రుణోదయంబున స్నానంబాడినవారు వారు వీరలేకాదశీ వ్రతపరులు
వారు సోమవారవ్రతులు, వీరు కృష్ణాష్టమీవ్రతాసక్తులు. వీరు ప్రతిది
నము దినకరునకు బ్రణామంబు నమస్కారంబు లాచరించువారు. ఒకరు
చేయు ధర్మమునకు సంతోషించు పుణ్యాత్ములితెంపు. వీరలరిషడ్వర్గం
బుంజయించిన ధీమంతులు వీరలు శివకేశవులయాలయంబులకుం జని
మ్రొక్కెడు పుణ్యులు, వీరలు భాగ్యమస్థిరమని తెలిసి కలిగినకొలది ర
హస్యంబున దానమిచ్చిన ఘనులు, వీరలు హరిహరుల నభేదబుద్ధిం గొలు
చుధీరులు. ఇంటబిండివంటలు దేవపితృకార్యేతరదినములందు వండిరేని
పరులకు బెట్టక తినని వారు వారు. పుస్తకములుగట్టి పుణ్యపురాణములు
వ్రాసి శిష్టులకు దానమిచ్చిన పుణ్యాత్ములు వీరు. ఉంగరములు పట్టుచీరె
లు వరాలు, గురువులకిచ్చినవారు వారు. వీరలు పుణ్యవ్రతంబులాచరిం
చిముగించి యుద్యాపనలొనర్చినవారు. వీరు నిష్కపటులు, వారు పరులమే
లోర్చినవారు. వీరుపకారులు, సాధుపూజకులు వారు. వారపకారులకుప
కారులు, వీరు మంత్రజపితులు, వీరు పరుషంబులు పలుకనివారు. వీరలుకు
తుపకాలంబున నతిథులకై వేచి వచ్చిన యతిథులం దోడ్కొనివచ్చి యర్ఘ్య
పాద్యాదివిధులం బూజించి భుజింపబెట్టినవారు. అనియిట్లు యముండు సా
నందునికిం దన పట్టణంబునకుం గల పూర్వపశ్చిమోత్తరద్వారంబులను నచ
టుచున్న పుణ్యాత్ములను జూపి వారు చేసిన పుణ్యంబు లెఱింగించి మ
ఱియు నిట్లనియె.

మహాత్మా దక్షిణపువాకిలి యొక్కటియున్నది. అదిచూడదగ
దు. అక్కడ మహాపాపులుండెదరు వారు మదాజ్ఞననుసరించి ఘోరనరకం

బుల వేయంబడి నరకఫలంబనుభవింపుచుందురు. అదివిస్తారము. దు
ర్ఘటము, ఉగ్రము, సంతాపకరము. దుష్ప్రభము, దుర్భ
రము, దుస్సహము, కావున గనరాదు. వినరాదు, తలపరాదు, కావున
జనదగదు. అందు బ్రహ్మహంతలు, శిశుహంతలు, పశుహంతలు, స్త్రీ
హంతలు, గర్భహంతలు, మిత్రద్రోహులు, కృతఘ్నులు, మొదలగు
వారును క్రూరచిత్తులును, నిగమద్వేషులును, హరిహరద్వేషులు, వి
శ్వాసఘాతకులు సకలఘాతకులు, స్వామిద్రోహులు మొదలుగాగలదు
ష్కర్ములు, త్రుటికాష్ఠానిమేషమాత్రకాలంబైన విరామంబు లేక పడ
నిపాట్లంబడి దుఃఖదహనదందహ్యమానమానసులయి వేదనలంబొరలు
చున్నవారు. మహానరకద్వారంబు మిమ్మువంటిమహానుభావులు స్వప్న
మందైన భావింపభావ్యంబుగాదు. మరలుదమనిన సానందుండు మందస్మి
తంబు సేసి యిట్లనియె. ఓయముడా నాకపనేల లేనిపోని దుశ్శంకలు క
ల్పించెదు. నేనన్నియుంజూడక కానిమరలను నీమాటవలనం బ్రయోజ
నంబులేదు. మేలునుగీడును సమముగా దలంచినమనుజుడు మనుజుడుగా
డు. మొదలసంకల్పించిన కార్యముందుదిముట్టింపలేనివాడు మానవుడేకీ
డైనమేలైన సంత్యజించవలె. ఆరంభించి కార్యంబుసాధింపలేనివాడు అనా
మకుడనందగు. కావున నావాకిలింజూపుము రమ్మన్న నతండిట్లనె. అయ్యా
యవ్వాకిలి మీరుచూచినపిమ్మట ననహ్యతకలిగికోపంబుగలుగునని వెర
చితి నింతియెగాని యేమింజెడ్డయు లేదు. మీవంటిదివ్యపురుషుల వాకిలిం
జూడగాదని తలచియట్లంటి. మీకుమనంబున నానారకులను వారను
భవించు నరకములను జూడవేడుకయ్యెనేని విచ్చేయుడు చూపించెదనని
సానందుం దోడ్కొని మహాంధకార బంధురంబగు దక్షిణద్వారంబు
చెంతకుం జనియె. అచట నీలదేహులు భయంకరాకారులునగు యమ
కింకరులు, తలుపులు దెఱచిరి. అచ్చోటనున్న నారకుల యార్తారవంబా
లించి సానందుండు కాళ్లుదడబడుచుండ మార్తాండతనయుం డీక్షించి
యయ్యా వీరింజూడ మీకు కుతూహలంబయ్యెనే, రండు గనుండు, వి
నుండు, నారకులయార్తనాదములు, మహాత్మా యీమహావ్రణంబమో

మయంబు చతుర్లక్ష యోజనవిస్తీర్ణంబు. ఇందు రౌరవాదిఘోరనర
కకూపంబులుగలవు. భువింబాపాత్ములతిఘోర మహాఘోరపాపంబులాచ
రించి మరణంబునొంది కర్మశరీరంబులు విడిచి ప్రేతకళేబరంబులు విడిచి
యాతనాశరీరంబులంది మదీయకింకరులు వెంటనంటిరా మార్గంబునం బె
క్కుడుములంబడుచు వైతరణీనదిం దరిసి దానిదాట శక్యంబుగాక మును
గుచు, దేలుచు. ఈదుచు, గొంతగాలంబయిన వానిని మదీయభటులీడ్చి
తెత్తురు. అట్టినారకులను మదీయకింకరులలో సేనానాయకులుచూచి చి
త్రగుప్తుండు చెప్పిన యాయానరకములందు వారలందోచి యమకింక
రులంగావలియుంతురు. నారకులు నరకములంబడి మద్భటులచే నల
యింపంబడుచు మిగులశోకింపుచుందురు. ఇట్లు వచ్చుచున్న ప్రేతనేతం
గని భటులుత్సాహంబునంపమతమనేర్పులు మెఱయంజూపుచు కొంద
ఱంబాపులపదంబులం దాళ్ళగట్టి యసిపత్రంబులంబెట్టి యిరుప్రక్క
దిప్పెదరు. నారకుల, మెదడు మాంసంబు ఖండంబులు నేయంబడుచుండు
ను. కొందఱంగుదియలతో మోదుదురు. కొందఱంగాలినరాపై నుదుకు
దురు. కొందఱందరాతంబులూడగొట్టుదరు కొందఱంబదనైన బాడిసెలతో
బదములు నఱకుదురు. కొందఱినిబల్లెములతో గ్రుమ్ముదురు, కొందఱను
నారసములతో మేనులుచ్చి పోగ్రుచ్చుదురు. కొందఱను ఱోళ్ళలోబెట్టి
యినుపరోకళ్ళతో దంపుదురు. కొందఱింగత్తులంబట్టినాలుకలు కోయు
దురు. కొందఱిం కఱకురంపంబులతో దనువులుదఱుగుదురు. కొందఱిని
గాలినగాలాలగుచ్చి లాగుదురు. గొందఱనుక్కు కొఱ్ఱులపైనెక్కిం
చి నుగ్గిక్కింతురు. కొందఱంగలగానుగులంబెట్టి యాడింతురు. కొందఱం
గోరుగండ్లతో గన్ను వెఱికినిమ్మపండ్లుగ్రుచ్చి చెట్లకంటగట్టి సింగాణికోలలం
జెండుదురు. కొందఱంబట్టి పులులకప్పగింతురు. కొందఱనలుగులతో బా
డుతురు. కొందరపయి దున్నలదోలింతురు. కొందఱిని శూలంబులందగి
లింతు కొందఱ సర్వాంగంబులంగాల సర్పములంగఱపింతురు, కొందఱి
నేలంగూలిచి తోమరంబులతో నొప్పింతురు, కొందఱికండలుకోయుదు
రు. కొందఱిప్రేవులుదొతురు. కొందఱిమొముకలు విరతురు. కొంద

మర్మములు వీడగొట్టుదురు. కొందఱనినుపముక్కుల కాకులు పొడిచి మాం
సంబూడదీయును. గండుతుమ్మెదలు ఝుమ్మని మూగి శరీరమ్ముల దొ
లుచును. శాకినీ ఢాకినీ ముఖ్యపిశాచములు కొందఱి రక్తముపీల్చును.
కుక్కలు బలమగు కోఱలతో కొందఱం జిరుదొడలు పట్టిపీకును. కొంద
ఱను మదపుటేనుగు నెక్కి త్రొక్కును. కొందఱను కొండముచ్చులువ
చ్చి పీకి కఱచి చీకాకుపఱచును. కొందఱిం దేళ్ళప్రాకరలం ద్రోయుదు
రు. కొందఱిశరీరంబులు గుల్లలుతిత్తులవునట్లుబాధింతురు. కొందఱకంట
కపాషాణప్రదేశంబులబడనీడ్చి శరీరంబు ప్రుల్లువడినంబుండ్లువెలికి యు
ప్పుంగారముంగూరుదురు. ఆకోతలా వేతలాకరకరి. యాయాతి యా
శీతి, యాకోల్లు, ఆకట్లు పడి నారకులు డస్సి దుఃఖితులయి యీబాధ
లెప్పుడుదప్పును. ఇంకేమిబాములుపడుదుమోయనుచు దమలోనిట్లను
కొనిరి. నిటలాక్షుంగొల్వమైతిమి. దేవతలకు మ్రొక్కమైతిమి. శంబుమం
త్రంబుజపింపమైతిమి. శివ్వోశువినమైతిమి. శైవచరితలు వినమైతిమి.
శూలియాలయంబునకేగి మ్రొక్కమైతిమి. పురారింబూజింపమైతిమి.
నుదుటవిభూతింబూయమైతిమి, రుద్రాక్షపేరులు దాల్పమైతిమి. కాశికి
బోమైతిమి. శివునికథలు వినమింజేసి చెవులలో నినుపశూలములు గ్రు
చ్చుచుండిరి. తొల్లిదానమీనిచేతుల బాడిసెలందఱుగుచున్నారు. తీర్థ
యాత్రలుచేయనిపాదములు రంపములగోయుచుండిరి. సజ్జనులతోడం
బ్రియంబుగ మాటలాడమికి నాలుకలగోసిరి. సజ్జనసహవాసంబుజేయ
మింజేసి పుణ్యలేశంబుగలుగదయ్యె. పాపఫలంబమితంబయియుండె.
ప్రమాదంబయ్యె. సుఖంబెట్లుకలుగుననుసమయంబునం ధర్మరాజుకింక
రులు కన్నెఱ్ఱజేయుచు భీషణభాషణంబుల నదల్చి యిట్లనిరి. ఓహో
యిల్లు గూలగ బావిత్రవ్వినట్లున్నది. మీమాటలుచూడగా మారాజు
చూచెనని మాకుమాటవచ్చు. పాపులారా యూరకనోరుమూసికొని
యుండుడు. అనికింకరులు శంకలేక నారకులందఱయు బిడిగ్రుద్దులుగ్రు
ద్దుచు, సింహనాదంబులుసేయుచు, క్రూరాస్త్రములంగొట్టుచు, నారా
చంబులనొందుచుండంగని సానంపంపు సమవర్తి కిట్లనియె. ఓయము

లించి యాచిచ్చున మండిపోవ గొందఱు మెడబట్టి నూకుచును, అఖండో
గండోపలంబుల గొందఱు గొట్టుచును, గొందఱు చండంబులు మండిపడ
సీసంబు గాచి పోయుచు, గొందఱు మంట పర్వతంబుల నెక్కింపుచు గొం
దఱు క్రిమికీటకనిబిడ దుర్గంధదుష్కూపంబుల ద్రోయుచు, తద్వేదనల
కు సహింపలేక దలలెత్తిచూచి రాలురువ్వుచు, నిట్టులనేకవిధంబుల బా
ధలు పెట్టుచున్నం బెట్టులిక్కనేలంబడువారును, మూర్ఛలమునుగువారు
ను, రోదనంబు సేయువారును, హాహాకారంబు సేయువారును, బొట్ట
ప్రేవుల్ గఱచికొని భటులయడుగుల పయిబడువారును, గట్టల్కబొట్ట
పట్టిసం దప్పించుకొని యెండారులమఱుగుసొచ్చువారును, గట్టడికట్టు
కొని యిట్లుండ్చిన నీడిగిలంబడి లేవలేనివారును, క్షుధావేదనలోర్వక చ
దికిలబడి మోదుకొనువారును, గటాబుద్ధిలేక పాదరక్షలతో విహా
ష్ణునివాసంబు ద్రొక్కితిమి, తత్పాదంబులం నిశితక్రకచంబుల ద్రో
యనాయె, ననిపలవించువారును, గర్వంబున, శర్వనిలయంబున నండ
జయానలతో గంధర్వవినోదంబు లాచరించితిమి. తత్ఫలంబునకై యి
నుపశృంగలంబుల సర్వాంగంబుల వేపంజొచ్చిరి- యనువారును, శైవ
నిర్మాల్యంబాఘ్రాణింపమైతిమి, నిశాతహేతివ్రాతంబుల ముక్కలుగో
యంబడుచుంటిమి, శివపూజా కుసుమంబు లపహరించితిమి, శిరంబులధ
రించితిమి, కానమస్తకంబు లుక్కునారసంబుల జెక్కల చేయుబడితిమి,
పరస్త్రీల యధరామృతపానం బొనర్చినందులకు దంతములుడుల్చి విషం
బుపోయంబడితిమి, యన్యస్త్రీల గామంబున జూచితిమని గోరుగండ్లం గ
న్నులు వ్రక్కలించిరనియు, బరలలన కుచంబుల నఖంబులుంచితిరిగాన
గాలినదబ్బనం బులివెయని గ్రుచ్చిరి. యితరతన్వంగులం గూడియనంగ
సంగరసుఖం బనుభవించితిరని కత్తులచే నండసహిత గుహ్యాంగంబుల
ఖండింపబడితిమి. పెద్దలం గని యాసనంబుల విడిచి లేవమికి ననలశిఖా
చ్ఛన్నాయస్తురంగంబుల నెక్కితిమైనం బ్రాణంబులుపోవు మొండిపాత్రి
ణము లెట్లుంబోవు, వంటయిలుసొచ్చినకుం దే లెందుబోవు, వానపాము
నశాశించి గాలంబునకుం జిక్కిన మీనంబుకరణి తుచ్ఛసుఖంబునకుం

పాల్పడిన మనకు దత్పాపంబు సహస్రవిధంబుల ననుభవింపనయ్యెడు, వెక్కసంబగు బాధలకు దాళలేక వెక్కివెక్కి యేడ్చువారును, నై నారకులాకాల దూతలంజూచి, యోపుణ్యాత్ములార మేమీకోతలకు రోతలకు, నీకాల్పులకు నీయవస్థకు, నోపుదుమే, మీబిడ్డలము, మాకె ప్పుడు దిక్కుమీరె, రక్షింపుడు, ఒకకత్తివేటున దెగ్రవేయుడు. ఒక మారగ్నింగాల్చి కడతేర్పుడు, ఒకమాటును శూలములతో జించివేయు డు. ఒకమాటు తైలపక్వంబున సంతమొందింపుడు పలువిధముల పలు తడవలు బాధలబడలేము మీశరీరములవంటి శరీరములు మావిగావు. కావున నికనైన మమ్ము మీకొనగాలంపన్ని విడువుడనిరి. మఱియు ధ ర్మరాజుంజూచి దేవా యీపాపంబులు మేమెల్ల ననుభవింపంజాలము నీ పాదంబులం జూడంగంటిమి. యికమాకీబాధల మాన్పనేయని వేడిరి. రా జ్యములక్కఱలేదు, భోగములక్కఱలేదు, మాటలక్కఱలేదు, ఇకనె న్నడు పాపంబొనరింపబోము, పుణ్యంబులె చేయుదుము. మమ్ముంగా పుము, పుణ్యాత్ములంబ్రోచుట పుణ్యంబుగాదు. మమ్ముంబోని కృపణు లంబ్రోచుటే ధర్మంబు అనినారకులు సాష్టాంగముగని మ్రొక్కి యోయ య్యలార, యాప్తులార మీరలీ నరకమను ఘోరవ్యాధి మాన్ప వచ్చిన సిద్ధులు, మీపాదసందర్శన మాత్రంబునన మాకు సౌఖ్యం బుకలిగె. నిక్కంబు మీరేనిపరేత రాజుతో జెప్పరే. యతడానతిచ్చిన నీ దూతలబాధకొంతమాకుదగ్గును, బ్రతుకగలుగుదుము. అని యిట్లాడు చు బహుదుఃఖంబులంబొరలుచున్న నారకులంజూచి భటులోహో మీరి లాగున నడచినగునె, మాకు రాజ్యమక్కఱలేదు, భోగమక్కఱలేదు. వదలితిరేని పాపంబులంజేయము. పుణ్యంబులొనర్తుమని విరక్తివచనం బులాడితిరి. ముక్కుతోనికురుపు మానినమీదట దాసరయ్యపూజమా టయన్నట్లున్నది. నెమిలి కన్నీరువెట్టినను వేటకానికి జాలికలుగదు. మీరెంతబతిమాలినను, గాసినొందినను మాకుగనికరముపుట్టదు. మం దుకైనను మాయొద్దదయలేదు తలగొట్టుమనగా జెవికిమందడిగినట్లున్న ది. మీమాటలాడుట ఈచిల్లరనరకములకే యోర్వలేమనుచున్నార





ష్ఫుడే యేమాయె. ఓహో సూచీముఖాదినరకము లాచంద్రార్కమును
భవించినను దీఱవు. మనవిచెప్పబోయి పెట్టగొడవ వచ్చెకోటీ. అని
మహోగ్రహంబున శమనకింకరులు నరకస్థుల బాధింపందొడంగిన నీశ్వ
రాయని సానందుండు దయామయుడయి యమునింజూచి వీరలేయే పా
పములొనర్చిరి చెప్పుమనియె. అనిన నంతకుండిట్లనియె.

యోగిపుంగవా వీరిపాపంబులు నోటనుడువ శక్యంబుగాద
ఎత్తినట్లు కొన్నిటిఁజెప్పెద [illegible]ంపుము రాజులేసినచో వీరు ఘనార్తియె
బ్రాహ్మణుండంపె. కొండెము చెప్పుట కులహాని పరహాని, కొండెమువి
నగానే కోపమువచ్చును. కొండెము వినువారు, కోపముగలవారు ముప్పు
దప్పించుకొనిపోలేరు. కొండెమువినువారు కుంభకోళకులని పెద్దలు చెప్పె
దరు. రాజు కొండెగాండ్రచే జిక్కినని పైపింబరాజ్యంబు పోవును, కా
వున రాజది తెలిసి రాజ్యముచేసవలెనని బాగుపడగలడు. రాజ్యమేలుచు,
ధర్మమువదిలి దుర్మంత్రులంబాడి ప్రత్యాగువారింబూజింపక సంప్రదా
యంబులు వదిలి దుర్మార్గుండై రాజ్యంబుచేసెనేని యారాజు రాజ్య
భ్రష్టుండగు, నంత్యంబున నరకంబున నుండు దుష్టులగు రాజులకు గతు
లుండునె. అట్టివారలకు నరకంబులె సిద్ధంబు. పుణ్యులగు క్షత్రియము
ఖ్యభూపాలురకు స్వర్గంబుదొరకె. ఈరాజు బ్రాహ్మణస్త్రీలందెచ్చి భో
గించెం గావున దీఱనినరకంబులంబడె. ఆవిదాస్యహానులయియుండు. ర
ణభీతులయి శిబిరములఁజొచ్చినవారిని భయంబునం బారిపరచినవారిని
కోచబారినవారిన్ని, కైదువులువదలినవారిని, [illegible]బహువులిడువారి,
ని, భయపడికొండలెక్కినవారిని, నదుగులబడినవారిని, బ్రతుకాస చేచె
ట్లకుబారికినవారిని, మరుగుజొచ్చినవారిని, ఏమరినవారిని రక్షింపక
యుద్ధభూమియందు వెతకివెతకిపట్టిచంపిన రాజాధములువీరు. మహా
పాపులు చూచితే పాపాత్ములకు వీసమణిమయాభరణములిచ్చెను. వీ
ఱు దుర్వ్యాపారమునకై విలవిలగొట్టుకొనును. అగమ్యాగాములు, మ
ద్యపులు, ధర్మంబుదప్ప జెప్పినవారు, బంగరుదొంగిలించినవారు, ము
ఖ్యులపయినిందమోపినవారు, పుణ్యమమ్ముకొన్నవారు, గృహదాహకు

లు, అన్నములో విషముబెట్టువారు, దేవతావిగ్రహంబులు కరిగించిన వారు, శైవాభరణంబులుముచ్చిలిపొట్టబోసికొనినవారు వారు. వీడు పశువధంబు సేసె వీడుదశమహాపాతకుడు. వాడు లేశమాత్రంబు దాక్షిణ్యంబులేనివాడు, వీడుశిశుహంత వీడుపాపభీతిలేక గజదానములుపట్టిన వాడు వాడురజకింబొందినవాడు. తండ్రిచచ్చినపుడు, తల్లి వృద్ధయైయూరకుండకపట్టి చిచ్చునందొరిగినవాడు, వీడుభార్యతో కలహపడి యాత్మహత్యగావించికొనియె. వీడు స్త్రీలునిదురింప రాత్రియందు మానభంగంబు నలుపబూనినవాడు, వీడుశివాలయంబున నున్నసొమ్ములంజడగొట్టినవాడు వాడు శైవనిలయంబులరాలుదెచ్చి యింటిగడపలుగబెట్టె వీడు స్త్రీమాటలునమ్మి కులంబుపయి నలిగివెలిబడియె. ఇతడు నదీతటాకాది శీతలజలంబుల స్నానంబాడ శారీరబలంబుకలిగియు సుకుమారుండై యుష్ణజలస్నానంబాడువాడు వాడు. శిష్టానుమతంబేని, దేవయోగ్యంబేని గాని కూడుగుడిచినవాడు. వీడుతాజదివినవిద్యయొరులకుంజెప్పని నేర్చిన కుక్క. అనియుత్తరుంగునం బాపలఘోరకర్మంబులు కొన్నిచెప్పినపని సానందుండాశ్చర్యంబునొంది, ధర్మాత్మా సముచితవగుటంజేసి నీవేమిచేసి నవలదని వ్యాసంబ్రహ్మాదులకుందరంబుగాదు. ఈజీవులుపడుదురవస్థల నీశ్వరుండెఱుంగు. నడయటుండెనిమ్ము. ఇంకొకసందియంబు డెందంబు నం బాడముచున్నది. ఎయ్యెవంటేసి పసిన, తొరిచిన ముక్కలుగోసిన ను, నలగగొట్టినను, చీలినను, నారకులు చాపరు గారణమేమని మరియు వీరిశరీరంబులు భూమింగాల్పబడియె. వీరికి దేహబంధంబులెట్లుగలిగె నీవుత్రికాలవేదివి. సర్వజంతుకోట్లమర్మకర్మంబులు నీచేతజిక్కియున్నవి. నీవెఱుంగని రహస్యంబుండదు. జీవదేహసంబంధంబెట్లు ప్రవర్తించు జీవస్వరూపంబెయ్యది. దేహస్వభావంబెట్లు. పిండోత్పత్తియెట్లు. దానికి శరీరబంధమోక్షంబులెట్లుఇట్టిరహస్యములిం కనుగలవవి నాకెఱుంగజెప్పవము.అనిన యముండిట్లనియె.

విశ్వంభరుండు పరంజ్యోతిస్స్వరూపుండు, శుద్ధసత్వుండు, జగత్సృష్టిస్థితిసంహారకారకుడు, చిదాకారుడు, ఆదిమధ్యాంతరహితుడు.

మంగళదాయకుడు, అప్రమేయుడు, అభవుడు, అష్టమూర్తియు నగు శంభునియంగంబుల భూతప్రపంచంబు పూర్ణంబయియుండు, చరాచర జీవసంఘంబులందు జీవాత్మయై. పరమాత్మయగు రెంటికి భేదంబులేదు. వటబీజన్యాయంబునను వహ్నియందు విస్ఫులింగంబులు పొడమినవడువున జీవులు మహాదేవునంశములని యెరుగుము. రజ్జువునందు సర్పభ్రాంతికలిగినట్లు నిరుపాధిక పరబ్రహ్మంబునందు మాయాసంబంధంబునం జేసి జీవస్వభావము ప్రసిద్ధంబయ్యె. అట్టిజీవుండిట్టివిశ్వంబున శాంభవీమాయామోహితుండయి యనాదికర్మవాసనావశముసంప్రారబ్ధంబునను సరించి చరాచరశరీరధారియై సుఖదుఃఖంబులు జీవాత్మకులేకున్నదైనను మహదహంకారభూతంబులైన యరిషడ్వర్గంబునం బ్రమత్తుండై వృథాకృతంబగు సుఖదుఃఖమోహదోషంబాత్మకులేదు. విద్వాంసుండయిన భూసురోత్తముండు సురాపానంబుసేసి యొడలెరుంగని చందంబున దుర్జయంబగు మాయాప్రకృతివలనగలుగు భ్రాంతిం జేసి జీవకోట్లు యజ్ఞాదిపుణ్యవిశేషంబులస్వర్గంబును బ్రహ్మహత్యాదిపాపంబులనరకంబులు ననుభవింతురు. ఇట్టిసర్వప్రపంచంబు మిథ్యయని యెఱింగి పండితులు జరాయుజాండజోద్భిజములు, జంగమంబులలో పశుపక్షిమృగాది తిర్యగ్జంతువులకభివ్యక్తి లేకుండుటం జేసి యవిపుణ్యపాపంబులంబొందవు. చతుర్విధజన్మంబులలోన జరాయుజంబముఖ్యంబందు మానుషదేహంబు ముఖ్యమని చెప్పబడు. అదిదుర్లభంబు తదుత్పత్తిక్రమము జెప్పెద నాకర్ణింపుము. సతిఋతుమతియై చతుర్థదినంబునం గానంబాడి మగనిమొగము గనుటతగవు. ఇతరుంజూచెనేని యట్టిపుత్రుం డుదయించు పదియాఱుదినములు ఋతుకాలము అందు బేసిరాత్రులసంగమించిన నింతిపుట్టును. సమరాత్రులయినం గొమరుండు కలుగును. సంఖ్యాసమయయంబులనపుంసకుండుగల్గు పదియాఱవనాడు సంగమించెనేని రాజుపుట్టును. పురుషునివీర్యంబధికమయ్యెనేని పురుషుండుపుట్టు. స్త్రీరక్తంబధికంబైన స్త్రీకలుగును. రెండుసమమైన నపుంసకుడగు పిండంబుకుడిప్రక్కనున్నం బురుషుండగు ఎడమప్రక్కనున్న స్త్రీయగు న

డుమనున్న నపుంసకుండగు. స్త్రీకి మనంబున గార్యభావంబుగలిగిన బురుషుండు జనించు, లజ్జాభయంబులు దోచిన నింతిపుట్టు. రెండుంగలిసిన షండుండు కలుగు. కారణములేక కార్యము కలుగదు. అట్లు పురుషుని వీర్యంబు స్త్రీగర్భంబునంబడి స్త్రీరక్తముతో జేరి పేరుకొనును. అదిసూక్ష్మ చర్మమునం బదుగాగప్పగ గర్భం బేర్పడును. మొదటినెల జీవుండు పదనుగను బుద్బుదముగను, రెండవనెల పిండమాంసముగనుండును. నాలుగవ నెలనవయవము లేర్పడును. అప్పుడు కొంతవిచారబుద్ధి యుదయించును. గర్భవాసమున జీవుండు వేదనం బొందును. ఐదవనెల మనస్సుబలపడును. మాంసము, రక్తము, నరములు, ఎముకలు, నఖములు, రోమములు నారవనెల నేర్పడును. ఏడవనెలయందుబలము [illegible] పూర్వజ్ఞానంబుదయించు గర్భనరకంబునకు దుఃఖించును. తల్లి జఠరాగ్ని వేడిచే దనువుడస్సి ప్రక్కయెముకలు రంపముంబోలి తాకగా సోలుచు జీము నెత్తురుదావు చుసూక్ష్మంబులగు క్రిములు మేనుగరవ నొరలుచు, మలమూత్రశ్లేష్మంబులంబడి పొరలుచు, ఉలికిపడుచు చేతులు బెవ్వులు మూసికొని పదములు సందులగేలు దోయిముడుచుకొని యుండును. అప్పుడు దనపూర్వజన్మకర్మంబులం దలంచు దుఃఖించు ముందుగలుగు [illegible] పూర్వకర్మవాసనలం దలంచు, దీనికి దెంపు లేదనియెంచు. ఇటువంటి ప్రారబ్ధానుభవంబని తలంచు. అని శోకింపుచు దైవమా గర్భస్థదుఃఖంబులెట్లు మాను. ఇకమీదట జన్మంబుగలుగని మార్గంబుగనుటయుత్తమంబు అని వివేకంబుకలిగి మోక్షమార్గం బాలోచింపుచుండు. అష్టమమాసంబున దేహంబుదయించు రక్తంబుపానంబున్ జేయును. అదియె సంజీవనంబై మాతృగర్భంబునం జననంబుగలిగించు అవ్వాంగంబులంగదలింపలేక మావిచేజుట్టబడి తల్లి భక్షించు నన్నరసంబు హృదయనాడీముఖంబునంజారి నాభిం జేరు దానం బ్రతికి బలముజెందు. అంత నవమమాసంబునం బ్రసూతిసమయంబునం గుక్షివివరంబు వెల్వడి యధోముఖుండయి యోనిద్వారంబున మలమేధోరుధిరసిక్తాంగుండయి జంత్రపుసూత్రము వలవ దప్పిజారిన బొమ్మవిధమున భూమిపయింబడు. అప్పుడు శరమను

త్రైదుపవాయువులు దశవాయువులందు ప్రాణవాయువు ముఖ్యంబు. అదికంఠగోళమునకు గ్రిందునాభికిమీదను సంచరింపుచు, నాసికారంధ్రములను, నాభీకుహరమున, హృత్పద్మమున వ్యాపించియుండు, అదియె భాషాశక్తికి మూలకారణము. అపానవాయువు, గుదస్థానమున, మేఢ్రమున, గటిస్థానమున, జంఘాయుగ్మమున, జఠరంబున వృషణముల నూరుల విహరించును. అదిమలమూత్రవీర్య విసర్జనములకు మూలము వ్యానంబుదృక్కోణ కర్ణరంధ్రములమెలగి ప్రాణాపానవ్యాపారములం గూడియుండు ఆమూడువాయువులం దేక భావముగాసమాన వాయువు జఠరాగ్ని సహచరత్వముగైకొని యన్నపానాదిరసమును దేహమందు సమముగా బంచిపెట్టును. సర్వనాడీమార్గంబుల దిరుగాడును దానవాయువు కరచరణావ్యవయవముల జరియింపజేయును తృషాక్షుధావ్యథలంబుట్టించును. ఉపరివాయువులు చర్మరోమరక్తమాంసమేదోస్థిమజ్జాదిసప్తధాతువులను విహరించియుండును. తేజస్సువలన, రూపంబు దీపనశక్తి, ప్రకాశము, శౌర్యము, బుద్ధిసూక్ష్మము, కోపముపుట్టును. జలములవలన జిహ్వాయు, శైత్యము, శరీరద్రవము, గలుగును. పృథ్వివలన ఘ్రాణంబుగంధము ధైర్యములుదయించు, తత్వంబులలో భూమిప్రధానము. అదిసస్యంబుల కాలయంబు భూమింబుట్టినవస్తువులుజీవులకు జీవనాధారంబగు, కావున పృథ్వీభూతంబు ప్రధానంబని పెద్దలు చెప్పుదురు. జ్ఞానవ్యాగాదిధాతువు లుత్పన్నంబులయ్యె. జంతువులుదిన్న వస్తువులు జఠరాగ్నివలనం బక్వంబగు. అవియె యన్నమనంబడు అదభక్షణేయను ధాతువువలనం బుట్టెంగాన నన్నమనబడును. ఆయన్నమున నంత్యభాగము పురీషమగు అదియె యన్నములోనిపిప్పి. అన్నసారంబు మధ్యమాంశమై మాంసమగు సూక్ష్మాంశముమనసయ్యె. కావున మన మన్నమయంబనంబరగె. ఉదకాహారంబు మూత్రమగు అందుమధ్యమాంశంబురక్తంబు. సూక్ష్మాంశంబు ప్రాణంబు కావున, ప్రాణావాఆపః యనివేదంబులు వచియించు. అగ్నికనిష్ఠమగు నంశమున శల్యములుమధ్యమాంశమున మజ్జసూక్ష్మాంశమున వాక్స్ఫురణ కావున దేజంబఖిల

లోకములకు నభిన్నాత్మకంబు శోణితంబువలన మాంసము దాన మేదస్సు
గలిగె. దానం గీకసములు గల్గె. అందు మజ్జ దాన శుక్లంబు దాన వాతాది
ధాతువులుండి తత్సారంబున నరములు గలిగె. మఱియు శరీరము, పది
దోసిళ్ల జలము, తొమ్మిదిదోసిళ్ల రసము, ఎనిమిదిదోసిళ్ల రక్తము, ఏడుదో
సిళ్ల పురీషము, ఆఱుదోసిళ్ల శ్లేష్మము, అయిదుదోసిళ్ల పైత్యము, నాల్గు
దోసిళ్ల మూత్రము, మూడుదోసిళ్ల మజ్జయు రెండుదోసిళ్ల మేదఃపంకం
బును, అరదోసిలి శుక్లంబును గలుదు. తద్వీర్యంబు గదా దేహమునకు
మూలము, అదియును గాక జలము రుచికరము, త్రిగుణంబు, నవకం
బున జతుర్విధములై షష్టి శతత్రియ శల్యములు గలిగియుండునని బు
ధులు చెప్పుదురు. అస్థిసంధులు నన్నూటపదిగలవు. అవి రౌరవంబులు,
ప్రిసవంబులు, సేచనంబులు, నులూఖఖండములు, సముద్గములు, మం
డలములు, శంఖములు, ఘాతములు, వాయసతుండమునం జేసకొన్న
కీకసంబులంగూడి కాయంబన్న విధాస్థిసంధులు జెన్నొందు. సర్వాంగము
లమీద మూడుకోట్ల తొంబదిలక్షల రోమకూపములుగలవు. లోకంబుల
నీశరీరంబుకంటె సారంబైన పదార్థంబులేదు, దేహాభిమానంబు సంబట్టువడి
సాహంకారులై పాలుమాలి జీవులు మహాపాతకోపపాతకములు జేయు
చున్నవారు. ఇట్టి దేహాలయుణంబు మోక్షాపేక్ష గలిగిన మాన్యులకుగాని
యన్యులకు బెన్నెలుపన్యసింపంబోను. మహాత్మా నికేతంబున నిమ్మహానీ
యరహస్యంబు ప్రకాశించుమ్యో నింక జీవస్వరూపంబు చెప్పెదవినుము.
నిరహంకారుడు, జిన్మయుడు, నిర్వాణదాయకుడు, మహాతేజస్వి, మ
హాయోగి సమస్తచరాచర పరిపూర్ణుడు, ఆనందరూపుడు, సూర్యచం
ద్రాగ్నినేత్రుడు జగత్కల్యాణుడగు శివుడు, లోకమునాడించుచు లోక
ముదాన్నై యుండు. ఇవియతనికి లీలలని యార్యులు వచియింతురు. స
మస్తజగములకు శివుండె కారణంబు బీజంబు అతడచ్యుతుడు, శక్తిమ
యుడు, ఆద్యంతరహితుడు, అఖిలలోకనాయకుడు. అతనిమాయదాటు
ట మానవునకు శక్యంబుగాదు. ఎవ్వని ననుగ్రహించు వానిచే బుణ్య
కార్యంబులు చేయించు ఎవ్వానియెడ బ్రీతిదగ్గదు వానిచే పాతకములు

చేయుందు, సంశయాత్మునకు మోక్షంబు లేదు. కావున సంశయమా
నాభిమానములు వదలి వేదాంత వాసనగలిగి మోక్షమార్గంబు సజ్జ
నుండు వెదుకందగు, వానికి మోక్షంబు సిద్ధంబు. అట్టివాడు మహీయులు
లాయఘుంటి కారణంబువినుండు వేదాంతవిద్యాభ్యాసకులు పాపంబులం
బోదోలి ముక్తికాంతం గైకొని సుఖులగుదురు. తత్త్వవిచారముకించి
న్మాత్రమయినం జేసిరేని యెట్టి పాతకంబులైనం బోవును. దూదిరాశిలో
నిప్పువేసిన నశింపదె తూలరాశి. సర్పాంబునం బ్రతిబింబంబుదోచినట్లు
సమస్త జగంబు లీశ్వరమాయం గలుగు. ఆశైవమాయ బ్రహ్మాదిసురవరు
లు గడువలేరు. యోగులీవిశ్వంబు శివమయంబని తలంతురు. అట్టి
యోగులయెడ దయకలిగి సద్గురుండు ధర్మవిజ్ఞాన వైరాగ్యభక్తులంబు
ట్టించు కావున సద్భావశ్రీమంతులౌదురని జనులుసద్గురుం బూజింపందగు.
శంభుదాస్యంబులేక సంసారబంధము వీడదు. శివధ్యానంబులేక తాప
త్రయములణగవు. ఈశ్వరభక్తిచేగాని దేహాభిమానము పోదు. నామ
కీర్తనము చేసినగాని సంశయములు వీడవు, కావున దనివిడిరసి మోహంబులవ
గులుకోక, యద్వైతభావం బవలంబించి యోగసంపదను నుండనేసియు
ట్టివాడు పుణ్యాత్ముండగు దానము లక్కఱలేదు, ధర్మములు, తపము, జ
పము లక్కఱలేదు. ఏమియు నక్కఱలేదు. కాయక్లేశములవల ఫల
ములేదు. శంకరునందు భక్తికలిగిన నన్నియుగలవు. ఎన్నిదోషములు
న్నను దాతృత్వముండనేని వానినెల్ల హరించు, అట్లుభవభక్తి గలిగిన
భవబంధంబులు వీడును. పాపము లొనరించినను శివపదసరసిజములభ
క్తి గలిగెనేని వాడు చిదంబరమొందును, కోటిజన్మములకుగాని యీశ్వ
రపదభక్తి గలుగదు. కావున శివభక్తులకు భవంబులుండవు. సంసార
ము దుఃఖహేతువగును. అయినను శివభక్తులంజూచిరేని మత్కింకరు
లు భయమంది వారున్నచోటికిం జనరు. కావున నమశ్శివాయ, సమ
స్తాంబాయయని నుడివినవారికి కైవల్యంబు దొరకును. శివుడానందస్వ
రూపుండు దేహములందు జీవస్వరూపుండై యుండు అదివివరింతువినుము
శ్రీమహాదేవుండు జీవస్వరూపుడై సర్వజగముల వ్యాపించియున్నవాడు

లాగ్రశతతమభాగంబయి జీవుండొప్పు. అట్టిసూక్ష్మరూపుండగు ప్రత్యగా
త్మ యవ్యయుఁడు, కదంబపుష్పకేసరంబుల రీతిని హృత్పద్మంబుననుండి
నానాముఖంబుల దేజరిల్లు, అనేకశరీరంబులు ధరించునాడులు శరీరరహితము
లు. నాడులు డెబ్బదిరెండువేలుగలవని యోగులు వక్కాణింతురు. ము
ఖ్యనాడులేకోత్తరశతము. అవి దశేంద్రియంబులం బ్రవేశించి తద్విష
యంబులకభిముఖంబులయి యనాది కర్మహేతువుం జేసి స్వస్వాదినిచభో
గంబులనుభవించు కొఱకు మహానదులు తీర్థంబులనుభవించు. అందొ
క్కనాడి యూర్ధ్వగతంబయి యంతంబులేక సుషుమ్నాఖ్యప్రసిద్ధంబ
యియుండు, ఆనాడియందు జీవంబువిడిచినవాఁడు పుణ్యాత్ముఁడు. ముక్తి
స్థానంబుజేరును. యోగులువానిం జన్మయుగా ధ్యానింతురు. రాహువ
దృశ్యుండయ్యు రవిమండలంబునం దోచుతెఱంగున జీవుండు లింగదే
హంబున నణఁగి కానరాక వ్యాపకుండయియుండె. ఘటమొక చోటికి గొ
నిపోబడునపుడందలి యాకాశంబును గదలును. ఘటభిన్నంబయిన గగన
మునట్లె యాకాశమండెకలియును. లింగదేహంబుననున్న జీవుండు. పూ
ర్ణుండయియుండు। కాయంబువిడుచుట యారోపణమాత్రంబెకాని ధ
ర్మముగాదు. సూర్యుడన్నిలోకంబుల వెలుంగునట్లు జీవుఁడు జ్ఞానంబుపే
ర్మిగర్మానుబంధప్రాప్తంబులగు భోగంబులనుభవించుకొఱకు గళేబరంబు
ధరియించె. లింగశరీరంబుచెడదు. సుఖదుఃఖరూపకర్మరహితుండయినపు
డు జీవుండు మోక్షంబునొందు. ఘటమునాకాశమునని ఘటాకాశమని
పేరు గలిగినట్లు లింగదేహంబుంబట్టి జీవుడనంబరగె. లింగశరీరమున
శించెనేని జీవుండు నిర్లేపుండయి యానందస్వరూపంబునొందు కావు
న వాసనాస్థితింబట్టి జీవేశ్వరభేదంబు భ్రాంతియెకాని వేరుకాదు. విను
ము విజ్ఞానంబున స్థూలసూక్ష్మకారణశరీరములు నిర్మూలములయిన జీ
వాత్మస్వయంజ్యోతిర్మయుండగు సూర్యుడొక్కరుఁడు సర్వభూతములం
దు నెట్లుప్రేరకుడయి విహరించునట్టి చందంబున దేహేంద్రియాదులకు
బరుండగు పురుషుడివ్విధమున జననమరణదుఃఖములు కలిగి మెలగినట్లు
[illegible]సంబంధంబునం బరిభ్రమించునట్టిది స్వప్నతుల్యంబని భావింపం

దగు దేహేంద్రియంబుల నాత్మబయలయ్యు మోహమాత్రంబునంగల
సినట్లుదోచు. స్వస్వరూపజ్ఞానేంద్రియంబయ్యె నేని స్వయంప్రకాశుండ
యి వెలుగు సత్యంబిత్తెఱంగున నాచేతంజెప్పంబడిన పరమరహస్యం
బు తొల్లి దండకారణ్యంబున రాఘవునకు విశ్వరూపకుండయిన శివుండా
నతిచ్చెనిది, వేదాంతసారంబు, మహనీయంబు. ఎవ్వరేనియు వినినంబ
ఠియించినఁబుస్తకంబున లిఖయించిన నాత్మజ్ఞానంబు కరతలామలకంబై
యుండు, దీనినిసందేహించిన నరుండెన్ని మార్గంబులదలచినం బవిత్రుం
డుగానేరడు. అని వేదశాస్త్రంబులు ఘోషించుం గావున సహజంబై యె
వ్వమిూ రెఱుంగని బ్రహ్మవిద్యావిశేషందెద్దియేనియుంగలదె బాలునిము
ఖవాక్యంబులు తలిదండ్రులు వినగోరినట్లు మీారునన్నడిగితిరి. అత్యంత
సంతోషంబయ్యె. ఇక నెయ్యదికర్తవ్యంబనిన సాసఁదుడాత్మగతంబున
ఇతనివాక్యములు సత్యములు. జగదుపసర్గాదులు భగవల్లీలలు, నా
రకుల ఘోరవేదనలు చూడగనే వినగనే నామనోధైర్యంబుచెడియె.
కావున గార్యాద్వైతము భావింపనివానింబశువందురు. భావాద్వైత
ము ముఖ్యము. కార్యము, భావమును సమమని తలపదగదు. ఒకడు
బాధపడుచున్నడేని యాబాధశివుడు పెట్టుచున్నాడని తలచువాడు మ
నుజాధముడగు అనికొంతతడవాలోచించి యమునికిట్లనియె. నీపలుకులు
సత్యంబులు నీవర్తనము శుభము. నిర్వాణప్రదంబు. నీవుపుణ్యాకరం
బగు నుపాఖ్యానంబుచెప్పితివి. నీచరిత్రమాచంద్రస్థాయియై నెగడుగాక
ఇట్టి గుహ్యతమంబగు విషయంబు చెప్పితివి గావున నానందితుండనైతి
నిన్నొక్కరహస్యంబువేడెద. దాచక చెప్పుము. ఈపాపులుమహాఘోర
నరకంబులంబడి కుళ్ళి బాధనొందవలసినదె. ఎన్నడయిన ముక్తిగల
దా. అనినంజిఱునవ్వెలయ జలజాప్తసుతుడిట్లనియె. ఇంద్రబ్రహ్మవిష్ణు
వుల మొఱలాలింపలోకోపకారంబుగా దాల్చిన గాలకూటముభారమని
విడిచిన నాడుశివుండు మముంజూచు, నపుడువీరికి ముక్తికలుగు, గరుడ
కిన్నరగంధర్వోరగాదులుకన్నియఁదెచ్చి వినాయకునికింబెండ్లియొనర్చిన
నాడువీరికి సుఖంబుగలుగు, సూర్యుండపరాద్రినుదయించి పూర్వగిరిన

స్తమించిననాడు వీరలకు ముక్తిగలుగును, అగ్నిజల్లనయిననాడు లవణస
ముద్రమందు మధురత్వమొందిననాడు, వీరకిదేహబంధంబువీడు. అనిచెప్పి
యూరకున్న సానందుండు మందస్మితంబుచేసి తనలోనిట్లనియెంచె. ఇత
నికిశైవవేదాంత వాసనలేదుగాబోలు నున్న నిట్లనడు కేవలాద్వైతభా
వనగలవారికి కర్మకాండంబేల పసులకు బుద్ధులుచెప్పగల పెద్దలకు నీచ
ములగు గుణములందొక్కటియుండు ఇదిగాక యితడెల్లప్పుడు పాపాత్ము
ల దోడ్తెచ్చి కొంచమైనం గనికరములేక నరకములందోసి బాధింపు
చుండె. శైవాగమ శైవ మంత్రంబులసత్తు యితనికేమి తెలియును.
శైవ మంత్రంబుల నశింపని పాతకములున్నవా, శతకోటి మహాపా
తకంబులను పర్వతంబులకు శంభు మంత్రము వజ్రము. అజ్ఞానాం
ధకారమునకు సూర్యకిరణంబు శంభుమంత్రము. అపత్స్వగంపరామేఘ
ములకు జంఝూనిలము శంభుమంత్రము. అఖిలవేదాంతమధ్య ప్రకాశ
మాననాయకమంత్రము శంభుమంత్రము సప్తకోటి మహామంత్రముల
కు రాజు పంచాక్షరి. అట్టిపంచాక్షరీమంత్రంబువిన్నబఠించినజనులకునర
కముండునె. సంసారబంధముండునె. పంచాక్షరీమంత్ర మూలమున రు
ద్రాధ్యాయంబు ప్రసిద్ధికెక్కె. అందుంబట్టి సప్తకాండంబగు యజుస్సు
వేదంబులమధ్యం బ్రసిద్ధంబయ్యె. పంచాక్షరీ మాహాత్మ్యంబున వేదం
బులకు జీవంబుగలిగె. అదియగస్త్యుడును రాముడును పాసించిరి. సర్వ
పాపహరమగు పంచాక్షరీమంత్ర మహిమయముడెఱుగడు, కటకటా
యమునికి దిక్పాలకత్వ మెట్లువచ్చునో తెలియదు. ఆపంచాక్షరీమం
త్రమీనారకుల పాపంబులు వోగొట్టి వీరల నరకంబునుండి యుద్ధరింప
లేదె. అనిమఱియు శమనునకిట్లనియె. శివుంబూజించువారల జెప్పనేల,
యెవండేని శివలింగమునకుం చెంబెడునీళ్ళతో నభిషేకించి కొంచెముప
త్రిబెట్టిపూజించెనేని యట్టివాని వంశ్యులందఱు శివసాలోక్య మందుదు
రు. శివుంబూజింపంగాంచన కుసుమమైనలేదా. భాలచంద్రు ధరియిం
చిన హరునర్చింపదూర్వయైనదొరకదా పత్రితోనైనంబూలతోనైనను
మానాధుబూజించిరేని నీనగరిమూడరు. శ్రద్ధనైననశ్రద్ధనైనశివునింబూజిం

ధీనవారు నీలోకముంజొరరు వీరలకాపాటి భాగ్యంబును లేదే. [illegible]ం
చెమంత విభూతిమైన లేదె. దానంబోదె నరకోపద్రవంబు. భస్మమహి
మంబు కాలాగ్నిరుద్రోపనిషదంబున వివరింపబడియె. ఈవిభూతి కాలా
గ్నిరుద్రుని వీర్యమని చెప్పుదురు. అతిధరించువాడు వీర్యవంతుండగు
మఱియు విభూతి ధరియించెనేని మద్యపాన, గురుభార్యా గమనాదిమ
హాపాతకములు పటాపంచలగును. గోరెడు భస్మమైన వీరికిగలుగదే
రుద్రాక్షధరుండు రెండవరుద్రుండని చెప్పుదురు. కోటిబ్రహ్మహత్యలు
కోటియగమ్యాగ మహాపాతకములు ఒకసారి మహాదేవా యన్నవడగు
మనుజుని నూత్రేండ్లలో నొకమాఱయినననడె. అదియె చాలును ఒకశి
వరాత్రినాడు జాగరము చేసెనేని వానిపుణ్యంబునకు మేర లేదు. అట్టి
సుగుణసంబంధము వీరిలో నొక్కరియందు నుండదే, సోమవారవ్రతం
బు నొనర్చినవారికి శివుండు వశ్యుడై యుండు అట్టిపుణ్యంబు వీరియందు
లేదె ప్రదోషపూజాపరులు లేరె. అరుణాచల మరుణాచల మరుణాచల
మన్న వారికి శివలోకంబుగలుగు వీరిలో నన్నవారు లేరె. శ్రీచిదంబరస్వా
మినిజూచిరేని శంభుసన్నిధిచేర గలుగును. గోకర్ణము, కాశీయాత్ర
లు చేసినను, శ్రీశైలశిఖరముచూచినను జనులు ముక్తులు సత్యంబుగన
గుదురు. నూఱుకోట్లపశువులు, తురంగములైదుకోట్లు, మేరువంతబం
గారును, నాలుగుకోట్లు, కలభములును పాత్రులగువిప్రులకిచ్చిన ఫలం
బు, ఒకసారి శివనామముచ్చరింప గలుగును. అట్టిపుణ్యంబు వీరిదగ్గఱ
నించుకైన లేదె. అనినదర్మ ధరుండిట్లనియె. యోగివర్యా నీమాటలమో
ఘములు, ధర్మశాస్త్రనిరోధములైయున్నవి, ఏవ్విధంబుననేని వీరికి శివ
స్మరణాదులందొక్కటియేని గల్గెనేని యిట్టులుందురె. వెట్టివాడా నా
మాటలుబోలె. తొల్లి శ్వేతుడను విప్రుండు జారకాంతకై పూవులుగో
యుచు, నొకపువ్వు నేలంబడి మన్నంటిన శివార్పితంబనియె వానికిగొప్ప
పదవిగలిగె మీరడిగినప్రశ్నంబుల కుత్తరంబుగా నీతిహాసంబుగలదు వి
నుపింతువినుము. అనిననిన తనయుంజెప్పుమని సానందుడై నతడిట్ల
నియె. కాంపిల్యపురమున యజ్ఞదత్తుడను ద్విజుడొకడుండెను. అతడుప

# శ్రీ సానందోపాఖ్యానము.

క్షితిసురుడు నిర్మలచరిత్రుండు యజ్ఞదీక్షితుండు విద్యానిధి. అతడుమహా
శాంతమూర్తి బ్రహ్మవంశమునకు గిరీటంబుంబోలెనొప్పు, మహాసుకు
మార సుందరశరీరుడు. అతనిభార్య సీతాసతికెనయగు విమలవిమల నా
బ్రసిద్ధిందనరె. అతనికి నొక్కకుమారుండు గలండతనికి దండ్రియుపన
యనంబొనర్చి గురువునొద్ద విద్యాభ్యాసమునకై యొప్పగించె. ఆబాల
కుండు వేదశాస్త్రములు చదువడు. ప్రాతస్స్నానంబు సేయడు గాయత్రి
జపింపడు. ఎపుడును దురాచారుండై విటులంధూర్తులంగూడి వాస్మథ
శాస్త్రవిచారణాదక్షుండై, వారాంగనామందిరంబులందూరి ధూర్తులం
జేరి జూదంబుగోరి యాడుచుండు. తిండివేళకు నింటికివచ్చి నచ్చి తల్లి
తో నచ్చికబుచ్చికలాడి తిండితినిబోవుచుండు. కలుగక కలుగక కలి
గినకొడుకు గనుక నతనిచెడునడకలు జననిజనకునికి దెలియనియదయ్యె.
ఇట్టిగారాబుబిడ్డడు దినదినమింటగలుగు ధనముసొమ్ములు దొంగిలివేశ్య
లకు బెట్టుచుండు. తల్లిమొఱింగియు ప్రేమంబునం బట్టినేమియుననడు. భ
ర్తయడిగిన నిపుడె యన్నముదిని చదువబోయెననును. ఇట్లుప్రతిదిన
ము జరుగుచుండె. ఇట్లుండనొకనాడు తల్లికుమారుం జేరదీసి తండ్రీమీ
తండ్రి మహాకోపియని యెఱుంగుదువుకదా సాధుశ్రేగినదళ పాలముగ
నిలువదనువిధమున నీదుర్వర్తనమతండు వినెనేని నీకును నాకుబ్రా
ణంబులకువచ్చు. రాజునకు దెలిసెనేని మాన్యక్షేత్రములు లాగికొనును
నీవంశంబునకు గీర్తినశించు. కావున దుర్మార్గుల సంపర్కంబు ని
గ్రహించి మంకుతనంబుమాని యింటంగల పదార్థంబులువ్యర్థంబు సేయ
కబుద్ధిగలిగి యుండుము. నీకులేమి గలిగిననొక పూటకైన నీకన్నదా
నంబిచ్చు వారుగలరె. అనిన నక్కుమారుండు విననట్లయుండి భోజ
నంబుసేసి శీఘ్రంబయెందేని చనియె. నాడుసోమయాజినదికింజని స్నా
నంబాడి నిత్యానుష్ఠానంబొనర్చి ధౌతవస్త్రంబుల ఫుదలదాలిచి సమి
త్కుశాదులు సంపాదించుకొని వచ్చునపుడు ఒకవిటునిచేతనున్న యుం
గరంబు జూచి కుండలములు గదల దలయూచి యిదివీనికెట్లు వచ్చె దీని
నాకు రాజుదానమిచ్చె. రాపెరింగినేని మోసమగును. ఈపసిపుటుంగ

రము వీనికెట్లు వచ్చె. నిదానింపక కానిస్థిరపర్ప రాదని యావిటుం జేర బిలిచి నీకీయుంగరమెక్కడిది చెప్పుము. చెప్పవేని రాజుతో జెప్పిదండ నము చేయింతు. అనిన వాడు వెరపునొందియిట్లనియె. దండమయ్యా నాకు దండనతోల నీకుమారుడు విటశేఖరుండయి జూదములాడుచున్నా డు అతడు నాతో జూదమాడినాడు. ఈయుంగరమతడు పందెములో బె ట్టినాడు నేను గెలిచినాను. మీసుతుని నదపాజ్ఞలలో నుంచక యెవరిని బెదరించెదవు. ఎవరి సొమ్ము పుచ్చుకోవలెననుకొంటివి చాలును జాలు నని యవ్విటుండరిగె. అంత నాపారుండచ్చో నిల్వగా లూదలేక మిక్కిలి కోపంబుగలిగి గొణుగు కొనుచు భార్యపయి నలుక గలుగ నింటికి వచ్చి పాదప్రక్షాళనం బాచరించి భార్యంబిలిచి యేమో మాటాడవు. బా వేమే నాయుంగరము దెచ్చి పెట్టుము. అదిపెట్టుకోక గాని భగవదారా ధన చేయను. అనిన నాపె యిట్లనియె. విభూతి పెట్టుకొమ్ము పొడిబట్ట లు కట్టుకొమ్ము హోమంబు గానిమ్ము పూజగానిమ్ము భోజనమయిన పిమ్మట నలంకారమ్ము కావచ్చు నప్పుడిచ్చెద కుతుపవేళయయినది. అ భ్యాగతులువచ్చియున్నవారు మీకు కోపమునకు సమయము గాదు. చిన్నవాడు అతోనవచ్చును, భోజనము గానిండు వేగము అనిన సోమ యాజిభార్య కిట్లనియె. చాలును లేసేటక్కరి తనమంతయు దెలిసినది. ఇదియేక యాటనేవా నీవునీకుమారుడు గూడియిల్లు పాడుచేసినారు కటకటా నేనే నాటినుండియో సంపాదించిన వస్తువులన్నియు నేమ యిపోయెనో నీవు స్త్రీవా కావు రాక్షసివి భార్యవా వీడు పుత్రుడా శ త్రువు మీరి క్షణరిబ లేచి పొందు పోశేని చంపెద. మీపొత్తుచాలు ను. చాలును. అని యిల్లు గలయవెదకిన మున్నుదా సంపాదించిన ధన ములు నగలు వస్త్రములు గానరావయ్యె అంతనయ్యావనిదేవుండయ్యో యియ్యభాగ్యుని మూలమున నేనుగుదిన్న వెలగకాయ విధంబుననయ్యె. నాయిల్లు సర్వ శూన్యం బయ్యెనని ధైర్యంబు నిలుపలేక యులపయి జవికిలబడి పెద్దయుం బొద్దునకు లేచి వేడి నిట్టూర్పు లడరంగ నలిపడి యొక్క దండంబు కేలనిడికొని యిల్లాలినిల్లు వెడలదరిమె. అప్పుడప్పడ

తి మిడిమిడి యెండలో గాళ్ళుగాల దల్లడింపుచు బుట్టింటికిం జనియె. యజ్ఞదత్తుని కొమరుండగు వృత్తాంతము విని శోకంబు గలిగి కట కటా దలువమా యెట్లుచేసితివి, ఇంక నెట్లుంటికి బోదునని పగలెల్ల నొక్క చోడాగి రాత్రి తిరిగి తెల్లవారిన పిమ్మట నాయూరు విడిచి యయ్యయ్యో పరదేశినయితి నాచేత జెల్లని కానయిన లేదు. నాకు విద్యయేమియు రాదు. విద్యరానివానికి విభవమెట్లబ్బును విద్వాంసుని సర్వజనులు బూజింతురు. విద్వాంసుండు రాజాస్థానం బూజితుండగు నాకు విద్య రాకున్నను దల్లి దయగలిగి ప్రోచు సమస్త వేద శాస్త్రంబులందు దల్లియే కదా మొదటి వేల్పని జెప్పంబడియె దల్లిలేనివాని బ్రతుకేల తనకేదికావలసినను దల్లిని గదా యడుగవలయు మనుష్యులకు దల్లియే యుండవలయు నేనెట్లు బ్రతుకుదు దోరుడని తెలిసెనేని రాజు దండించునని యీయూరు వాసి చనిచని మధ్యాహ్నంబగు నంతకు రెండామడ నడచి యొక్క యరణ్యంబున నెండవేడిమికి దాళలేక యొక్క మహావట తరుచ్ఛాయం జేరి యిట్లనితలంచె తల్లిప్రతిదినము పెందలకడం బ్రేమతోడం బెరుగు వంటక మప్పడాలు పచ్చళ్ళు కూరలు పిండివంటలు పెట్టుచుండె. అట్టిపుడెవ్వరు పెట్టెదరు. నేనాకలికోర్వజాలనని చింతింపుచుండె. ఇంతట సూర్యాస్తమయంబయ్యె. అంతంగొంతవడికి శివార్చకులు దెచ్చునైవేద్యగంధం బాఘ్రాణించి విమలాకుమారుండు సంతసింపుచు వారివెంటనంటిచని శివాలయద్వారంబుచేరి, వారితో గోపురప్రాకారంబులుదాటిచని యమ్మంజుల సరసపదార్థసంపన్నంబయిన యన్నంబు నాకెట్లుదొరకునోయని విచారించి యొక్కచక్కి నివసించియుండె. ఆదినమున మహాశివరాత్రిగావున భక్తులుపవసించి శివసన్నిధిం జాగరణం బొనరింప నెంచి పుణ్యతీర్థంబుల మునింగి ధౌతవస్త్రంబులు ధరియించి భస్మరుద్రాక్షమాలికాధరులై శైవపంచాక్షరీజపంబుగావించి ప్రదక్షిణ నమస్కారంబులుగావించి మహాభక్తియుక్తులై నిర్మలచిత్తులై గర్భగృహంబుజొచ్చిన యన్నాంబు జంబులకానందంబు గలుగంగందర్పదర్ప హారిం దర్శించిరప్పుడు శుభాంగము సకలదేవతా హృదయాబ్జభృంగమును,

శ్రుపాబ్ధితరంగమును, భక్తరత్నసోపాయరన ప్రసంగము, శివాతనుసం
గముసగు లింగముంజూచి పూజాద్రవ్యంబులుగట్టి వేదవాదంబులు చె
లగబహిర్ద్వారంబున భేరీమృదంగకాహళ నిఖిలవాద్యవిశేషములు ఘో
షింపం బరమోత్సాహంబున, శివునికి నభిషేకంబాచరించి దిగంబరున
కంబరంబిడి, గంధసింధురదనుజధ్వంసికిగంధమిడి, ఫాలాక్షునకక్షతలిడి
సుమాస్త్రశత్రునకు గుసుమములువెట్టి జగద్దీపమునకు దీపంబువెట్టిధూప
మర్పించివేదవేద్యునకు నైవేద్యమిచ్చి యిట్లు వివిధోపచారములదృప్తిం
బొందించి నిటలన్యస్తహస్తులయి భజింపుచుండిరి. శ్రీకంఠామహేశ్వరా
క్షేమంకర భీమా, భర్గా, గౌరీకాంతా, రుద్రావిద్యాకల్పామునీంద్రర
క్షకాయ మహాదేవా విశ్వరూపాయని నమస్కరింపుచు స్తుతింపుచుం
డిరి. ఇట్లనేక విధములం గాళీవిభునింగై వారములు సేయువారును, ఫా
లాక్షునకు బ్రదక్షిణంబులుగావించువారునునిందుధరునకు సాష్టాంగదం
డంబులు సమర్పించువారును నందికేశ్వరు పిఱుందనిలిచి నృత్యంబు సలు
పువారును, పంచాక్షరీమంత్రరాజము జపించువారును బంచముఖుహృ
త్పద్మంబున ధ్యానించువారును. బ్రతియామంబునం బరమేశ్వరుమృణ్మ
యలింగంబులావాహనంబుసేసి [illegible]తార్చనాది షోడశోపచారము
లం బూజించువారును. శివనామాంకిత గద్యపద్యముల బాడువారును,
బావనశైవపురాణములుచదువువారును, దత్ప్రసంగమ్ములంబ్రొద్దుపుచ్చు
వారును, శైవరహస్యమహిమాతిశయములదలచి యోచించువారునై
బ్రహృష్టచిత్తులై [illegible] నా టిరాత్రివేగునంతకు జాగరణంబుసేసి
కొందఱు మాటలాడుచు [illegible]వారును, గొందఱొండొరుల
మీదంబడి శరీరంబులు[illegible]వారును గొందఱు నక్షత్రంబులు చూచి
వచ్చి కూర్చుండువారును గొందఱావులించుచు దూలిపడి యిట్టటుతిరు
గువారును గొందఱొట్టుకునికిపాటుపడుటకా యిక్కడికివచ్చినారన్నసులికి
పడి యక్కడినుంచి లేచిపోవువారును. అట్టిచోటనింకొకడువచ్చి విశ్ర
మించువాడును. గొందఱింతపర్యంతంబు మేల్కొనియుండి కొంచము
సేపులో దెల్లవాఱును నింతమాత్రములో బ్రతభంగంబేల చేసికొందుర

న్న మీరుతూగిపోలేదా యనువారును, మఱియు నానాప్రకారములం
బ్రజలు చొక్కి సోలి నిద్రాపరవశులయి యున్నంతయాజ్ఞదత్త యిది
సమయమని తలచియడుగుల చప్పుడు వినబడకుండ మెల్లన నడిచి గ
ర్భగృహంబులంజొచ్చి, దీపమ్మాఱిపోవుటకు సిద్ధముగానున్నంజూచి తన
పంచెకొంగు చప్పునజించి వత్తి చేసివేసి నెయ్యివోసి దీపంబు బలపర్చి
పానవట్టంబు దగ్గఱనున్న బంగరుగిన్నె యపహరించి పాఱిపోవుచుండగ
తొందరచే నొక్కనిద్రొక్క. వాడు వెంటనే లేచి దొంగదొంగ యది
గో బంగరుగిన్నె. యెత్తికొనిపాఱిపోవుచున్నాడని కేకలువేసె. అంతం
దలవరులు నలుప్రక్కలచుట్టికొని శస్త్రములతో నాబ్రాహ్మణుంబట్టికొ
ట్టిరి. అంతనయ్యాజ్ఞదత్తమృతుండయ్యె. అప్పుడుమదీయకింకరులు దూ
రదూరముననె నిల్చిభయభక్తిసంభ్రమంబులం బ్రణమిల్లి శైవకింకరు
లకిట్లనిరి. ఓ మహామహులారా, శైవకింకరులారా, యీపాపాత్ముని
కడకేలవచ్చినారు. వీడువర్ణాశ్రమధర్మవిహీనుడు. పితృద్వేషి, చోరుడు
శైవనిర్మాల్యాపహారి, జూదరి, పరస్త్రీసక్తుడు, వీడుయమలోకార్హు
డు మీరుకొంచెము విచారింపుడు, వీనిమీఁదదయ యమునికిఁ జూపద
గును. రాజులుస్వతంత్రులు గనుకధర్మముం జూడరు. వీడుపంచాక్షరిజ
పియించెనా, శివునిపాదపంకజములు మరణసమయంబునస్మరణకుఁదెచ్చె
నాశివపూజలుచేసెనా, ధర్మసూక్ష్మత్వమేదయినగలదా, మీదాసాను
దాసులమగు మాకీవిషయంబుఁదెలుపుడన్నం బ్రమథులిట్లనిరి. శైవధర్మ
సూక్ష్మతం దెలియుట సామాన్యంబె. తన్మహిమబ్రహ్మవిష్ణువాసుకిగురు
సురేంద్రులకైన నశక్యంబు దెలిసినట్లయుండునుఁ దెలియదు. తెలియబ
డనిదైనను తర్వాతదెలియును. వినుము. వీడన్నంబుదొరకనందున శివ
రాత్రినాఁడుపవసించుటగలిగె. శివపూజతాఁజేయకున్న నొరులుచేయుచుం
డం జూడగలిగె. అన్నముకొఱకు సమయమెప్పుడగునని తెల్లవాఱువఱ
కు జాగరముచేసె. అన్నపాత్రకనుపడుటకై శివసన్నిధిదీపంబుబాగుచే
సె. శివలింగములదర్శించె. తత్కథలువినియె. శివాలయంబున మహాల
యుంబునొందె. ఇంతకంటె సుకృతంబులెవ్వి, కావున నీమహానుభావుం

డు, శివభక్తాగ్రేసరుడు. యముని నరకలోకము జూడదగడు. శివకైంకర్యంబుం జేయదగినవాడని వానిని దివ్యశరీరము బ్రవేశపెట్టిరి. మఱియు నో యమకింకరులారా, యింక మీరు వచ్చిన దారింబట్టి పొండు మీ మాటలిచ్చట జెల్లవు. ఈ పరీక్షిన్నియు మీ కేలయని యా విప్రుని విమానంబున నెక్కించుకొని కైలాసమునకుఁ దీసికొని పోయిరి. యమకింకరులు విస్మయావిష్ట చేతస్కులయి సర్వేశ్వర మాహాత్మ్యంబు గొనియాడి బళిబళి యిట్టి పాపాత్మునకు స్థిరంబు నానందంబునగు కైవల్యంబు దొరకెననిరి. ఈ కథ విన్నవారలు మోక్షము పొందగలరు. కావున నీయుపాఖ్యానంబు పరమపావనంబు. మఱియు నిమ్మహాశివరాత్రి ప్రభావంబునం జెందు మవారొకండు మోక్షంబునొందె. ఆకథం జెప్పెద వినుము. శాకల దేశమున మందకీలుడను కిరాతనేతగలుడు. వాడు మహాక్రూరుడు, నిఖిలమృగపక్షి ప్రాణాపహారి. వాడొకనాటి ప్రొద్దుట నడవికిం బోయి వేటాడు శునకములం దోడ్కొనిచని వలలుబాలు మున్నగు సాధనంబులం పన్ని కాచియున్న నొక్కమృగంబేని పక్షియేని వానికి దొరకదాయె. ఇట్లు దినమంతయు వాడెంతయు నలసి యత్నంబు సేసినను గష్టంబు ఫలింపదయ్యె. రాత్రి వచ్చె. అపుడా నిషాదుండు మహావిషాదంబునొంది యిట్లని వితర్కించె దరిద్రుడు లోభివానిని వేడంబోయినట్లయ్యె నేడు. నే నెన్నడు వేట రానె. మృగాదులు దొరకవైనా బలముచాలదా, సాధనముల మోఘములయ్యెనా, యయ్యయో, యేనెట్టి వేళయిలు వెడలితినో, యొకమెలుకయైన దొరకదా పందివలకు దగిలి పాఱిపోయె, జింకయురికియు దప్పించుకొని పోయె, చీకటి బలమగుచున్నది. మిణుగురు బురువులు బయలు వెడలె పాములు బుస్సుమనుచుం బుట్టలనుండి వెడలె. భూత ప్రేత పిశాచ నాదంబులును సంచారములును భయంబు గొల్పుచున్నవి. ఇట్టి రాత్రి నేనేమి చేయుదు. ఆకలి మెక్కువయ్యె దప్పి హెచ్చుచుండె. ఇంటనాలు బిడ్డలేమయిరో, నాకై యెట్లు పరితపింపుచుండిరో, నేనింటికిం బోతినేని పిల్లలేమి తెచ్చితివని యడుగుదురు. ఆలు పిట్టలేవి మెకాలేవి, యేమాంసము దెచ్చినావని యడుగుదురేమి చెప్పుదునని తలంచుచు నచ్చటనుండి కొంతవొకచో

చేరి యచ్ఛటవిమలసలిలరమణీయంబగు నొక్కకొలనింగాంచి దాని
యొడ్డుననొక్క మారేడుచెట్టుంజూచి యీరాత్రి జలపానార్థంబువచ్చు
మృగంబుల నీచెట్టుమీదనుండి బాణంబువేసి కొట్టవచ్చుననియెంచి యీ
చెట్టెక్కి విల్లెక్కుపెట్టి దిశలాలోకింపుచుండె. అంతకంతరాత్రియైనకొల
ది మంచుపట్టి వానవలెగురియుచుండె అపుడు వానిదృష్టికి వృక్షముప
త్రములడ్డంబయ్యె. అపుడా కిరాతుడు తనకునడ్డంబయినయాకులందుం
పి క్రిందబాఱవైచుచుండె. అవియొకశివలింగంబుపయి బడుచుండె. ఇ
ట్లుతెల్లవారువరకు బిల్వపత్రములుద్రుంచి శివలింగముపయిబడుచుండె.
ఇట్లు పగలుపవాసంబును, రాత్రిజాగరణంబును, బిల్వపూజనంబును జే
యుటచే కిరాతునకు నాడుశివరాత్రి గావున శివరాత్రివ్రతఫలంబుసిద్ధిం
చెను. కొన్నాళ్ళకువాడు మృతినొందెను. వానిని నాభటులు పట్టుకొని
తేబోయిరి. వారింగొట్టి శివభటులా కిరాతునికి దివ్యశరీరంబిచ్చి విమా
నంబెక్కించి తీసికొనిపోవుచుండిరి: అపుడు నాభటులు శైవకింకరులకిట్ల
నిరి పాపాత్ముడగు నీయెఱుకకే యెఱుకచే కైలాసంబుకలిగె. మమ్మేల
యడ్డుపెట్టెదరు. మీరీతనికొనిపోవలదన్న నీశ్వరకింకరులిట్లనిరి. శివ
రాత్రిజాగరణంబు కోటిసంవత్సరతపఃఫలంబునతిక్రమించు. శివరాత్రి
యుపవాసంబు నూరుయజ్ఞంబుల ఫలంబును మించును. శివరాత్రినాడు
శివుంజూచినేని గంగాస్నానఫలంబగు బిల్వపత్రములతో శివరాత్రినాడు
శివుంబూజించుట. శంఖసంఖ్యయగు నుత్తమ ద్విజులబూజించినట్లగు
కాబట్టి శివరాత్రిమహిమయిట్టిది. ఈసంగతి మీదొరకుజెప్పుడని వార
లరిగిరి. కావున మహాశివరాత్రివ్రతమిట్టిప్రభావముగలది. ఇదియెఱుకయె
ఱుగకయె చేయగలిగె. కావుననెఱిగి చేసినవారిపుణ్యంబునకు మేరగల
దె, ఇంకొక యితిహాసంబుగలదది మిగులవిచిత్రంబై యుండు వినుడు తొ
ల్లి మహారాష్ట్రదేశమున వేదనాధుడను నొక బ్రాహ్మణుడుండెను. అ
తడు సన్మార్గప్రవర్తకుడయి జగత్ప్రసిద్ధుడయియుండె. అతనిభార్యదుశ్శీ
ల దుశ్శీలయె. ధర్మద్వేషిణి, అధర్మనిరతురాలు, జారిణి, [illegible]
మామలదిట్టుచుండు. కన్నుసన్నల చేసన్నలవన్నెకాండ్రంజేర్చు. నిమి

తైర్థికులాకులట నేదేనివిధమున మల్లికార్జున దేవుసన్నిధి వీథిలోగూ
ర్చుండబెట్టిరి. ఆకలిదప్పులు బాధింపం బెద్దయెలుగున నఱచుచుండె.
నాడుశివరాత్రిగావున నెవ్వరుభుజింపరు. ఒక్కశివభక్తుండు పూజార్థం
బు శ్రీదళములును, జలంబులును గొనిపోవుచు దానిచేతనొకదళమును
బుడిసెడు జలముంబడ వేసెను. అవియాహార యోగ్యములు గామినెఱిం
గి శైవభక్తుందూరుచు బత్త్రోదకంబులం బాఱంజిమ్మె. అవియచ్చట
నున్న సనాతనపావన శివలింగముపైబడియెను. కావున శివరాత్రియు
పవాసమును, జాగరణమును, శివపూజయు లభించెను శ్రీశైలమునకు
వచ్చుటయు దటస్థమయ్యె. కావున శైవకింకరులు మనీయకింకరులం
బాఱంద్రోలియా లలనందివ్యాభరణ భూషితంజేసి విమానముపై నె
క్కించికొని దేవతాబృందము గంధర్వులుగొలువ శివలోకంబునకుం
గొంపోయిరి. శివరాత్రి ప్రభావంబున నాయింతి మహాపాపములువల
న ముక్తయై గౌతమాది మహర్షులకు నందరాని శివసాయుజ్యంబునొం
దె. శైవధర్మరహస్యము లీకరణిప్రకాశమానములై వెలుగొందు.
ఇంకనొక్క యితిహాసముచెప్పెద నాకర్ణింపుము. కళింగదేశమునం
గళింగనాథుడని యొకరాజుగలడు. అతడుదారుడగు మహావిభము
గలవాడు. అతనిపట్టపుదేవి సౌందర్యవతి వసువర్ధనియను పేరిట
నొప్పు, అగిమిగుల గామంబుగలదై పరపురుషులకొఱకయి జతనంబు
చేయుచుండు. ఒకనాడు పౌరోహితుడు రాజగృహమునకు వచ్చెను.
రాజింట లేడు. ఇట్లాపురోహితుంగూడుచు రాజభార్య యిష్టవినోదంబు
ననుండె. ఒకనాడు కిరాతులు కొందఱు వన్యంబులు గొనుకదెచ్చి రా
జుంబొడగాంచి యర్పించి రాజును వేటకు వేంచేయుమని విన్నవించి నిలి
చియుండిరి. అపుడాపృథివీశుకాంత యాయొఱుకంజూచి కనుసైగచే
లోనికిబిలిచె, పిలిచినవాడు నలుకక యాచిలుకలకొలికి కడకరిగె. అది
యు వానింజేరబిలిచి యోగిరము వెట్టించి వానిలో బహువిధబంధంబు
లగూడు మనోజసుఖ మహార్ణవమగ్నయయి పరవశయైయుండె. ఇట్లున్న
భార్యంజూచి రాజాగ్రహగ్రస్తుండై యొఱలోని ఖడ్గంబుదీసి చంపనుం

కించి మఱల బశ్చాత్తాపంబుగలిగి స్త్రీహత్యయనిజంకి వారల నిద్దఱం బురంబు వెడలంబంపి తారాజ్యంబేలుచుండె. ఆరాజుభార్య బోయం గూడి వనంబున విహరింపుచు గొన్నాళ్ళకు గర్భిణియయ్యె. ఆనిషాదు నెడబాయక మధ్యంబుఁగ్రోలుచు మాంసంబుదినుచు నుల్లాసంబునంబ్రొద్దుపుచ్చుచుండె. రాజభార్యయయ్యుం బూర్వజన్మకృత దుష్కృత వశంబున నీచవర్తనకలదయ్యె. ఇట్లుండి యొకనాడా జారిణియొక్కస రోవరమునకు నీర్లాడనేగె. అక్కడసుందర సుకుమార శరీరుండును న వయౌవనుండునునగు నొక్కవిప్రకుమారుడు తటస్థపడియె. వానింజూచి మరులుగొని వానింగని వానింగూడుమని వేడికొనియె. వాడును దానిరూపునకాశించి సంభోగించె. పూర్ణగర్భవతిగావున దద్దోషంబున వాడాక్షణంబ మృతుడయ్యె. అట్లుమృతుడైన బ్రాహ్మణకుమారుంజూచి యామెలవయులికిపడియె. కొంతసేపటికి దానికినొప్పులెత్తి యొక్కబిడ్డంగని యాబిడ్డ నొక్కచెట్టుక్రిందంబెట్టి యింటికింజనియె. బ్రాహ్మణకుమారుని సోదరివిధవ తనతమ్ముడు రాడాయెనేయని తత్తరపడి య దుగులజాడంబడి యక్కడికేతెంచి చచ్చిపడియున్న వానింగనిమొత్తుకొని నేడిచి శస్త్రకుదాన యుపశమించుకొని కట్టెలుపేర్చి యందుందమ్ము నింబెట్టి చచ్చిడివానిని దహించి స్నానంబాడివచ్చుచు గావుకావనియేడ్చుచున్న బాలుంజూచి తలయూచి విస్మయంబంది యింటికిందెచ్చి జల కంబార్చి యిమ్మహారణ్యంబుననున్న వీడుదిక్కులేకున్నవాడు మ్లేచ్ఛకులసంభవుండుగాడు. సంకరజాతుండుగాన శంకరుండనిపేరిడి పెంచుచుండె. వసువర్ధనియు గిరాతుండు, నిర్ధనుడు దుర్బలుడు నయ్యెననివిడిచి ద్వీపంబులు చూడవేడుకగలిగి యోడపయనంబయి కొందఱు కోడాగాండ్లంగూడి చనుచుండె. సంద్రమునగొంత దూరమరుగనొక్కతుపానుగొట్టి బోనమునిగె. అందుంజచ్చినవారిని మద్భటులేగి దారుణ వారుణ పాశబద్ధులంజేసి తోడ్తేర, నీశ్వరకింకరులు దివ్యవిమానమెక్కటిపట్టుకొని యంబరతలంబుననిల్చి మేముపట్టుకొన్న వసువర్ధనింబట్టుకొని తమవిమానమునం గూర్చుండబెట్టుకొని పోవుచుండిరి. ఈపాపాత్ము

రాలికి గైలాసమీయవగునా, యేపుణ్యమొనర్చినది, చెపుడనిన శంకరకింకరులు కొంకకమందహాసముసేసి యిట్లనిరి. శంకరశంకరాయని శివనామస్మరణ చేసినవారికి శివుడుముక్తినిచ్చు. శంకరుని గన్నతల్లికిముక్తియిచ్చుట యబ్బురమె. ఈసతికొడుకునకు శంకరుడను పేరుగలదు. కావున దీనింద్రోడితెమ్మని మాకాదేశంబిచ్చెను. మీరాతనికింజెప్పుడు పొందనిరి. కాబట్టి శివనామోచ్చారణ మాహాత్మ్యంబెవ్వరుకొని యాడగలరు. ఇంకొక యితిహాసము చెప్పెదవినుము. యమునానదీతీరమునందు గాంచనాకరమున నొక్కచక్కని పట్టణముగలదు. అట్టికళింగదేశమున సుధాముడను నొకరాజుగలడు. అతడు కీర్తిమంతుడు ధర్మాత్ముడు మహాశూరుడు శత్రువులగెల్చి నిష్కంటకంబుగ రాజ్యమేలుచుండె.

ఆరాజుకుమారుడు నవయౌవనవిలాసియై మహావిటగ్రామణియై విహరింపుచుండు, వీనివ్యాపారంబులంజూచి జనులు వీఁడు రాజశేఖరుడు గాడు, విటశేఖరుడని పిల్చుచుండిరి. వీడెప్పుడు మాచిన వేశ్యాంగనాడియు భుజంగులంగూడియు విహరింపుచుండు. ఒకనాడీకుమారుడు కస్తురి వాసన ఘుమ్ముఘుమ్మన నెరయగోకాము మొలనుగట్టి సిగవేసిమొల్లని పట్టుబొందు దాన్నిపైనిజుట్టి వక్షస్థలమున గందములందిపైకి నీదువ్వాలువ యొల్లెవాటువేసికొని విటులుపరిహాసకులు నటులు జూదరులు వెంటనడువ, సిగ్గును వెఱపునులేక వేశ్యావాటికకు వచ్చుచుండు ఆవేశ్యాబృందమునం బద్మముఖియును యౌవనవతియు నగు నొకమహాజీవ యందముగలదై పల్లవిక హృదయపద్మములం గరంచుచు సునందయను నామంబున విహరింపుచుండు. ఈరాజశేఖరుడా రాజముఖింవవిలి కృత్రిమపర్వతములం గృతక నదులం గందర్పకేళీలోలుండై విహరించు. ఇట్లుండ నొకనాడా రాజశేఖరుడా మందయానతో బాలయెక్కవెట్టికొని యింటికివచ్చియుండె. తనప్రియురాలికై యెదురుచూచుచు నెపుడువచ్చునో తోటనుండివచ్చునో నామచ్చకంటి కటకటా నను విడిచితే నేనెట్లోర్తునెట్లుబ్రతుకుదు సియ్యధరమీవే, నీకౌగిలిబట్టనియ్యవే, యనివియోగవేదన కోర్వలేకయుండె. ఇంతటరవి గ్రుంకె. చంద్రుడుదయించె. అంతంగో

క్రాకాంతాకుమారుండు మఱింత చింతనొంది చంద్రుఁడిట్టి మందగం
ధవహంబుమారి మారునాడియారాత్రి వేగివేగిన సుగంధందలంచుచుదా
నియింటికై రాజమార్గంబునం జనుచుండె. అపుడు శరీరమునందెల్ల
నివిబూదిరాచి కంఠమున రుద్రాక్షలుధరియించి ఫాలంబునం దిర్యక్పుం
డ్రంబు వెట్టి స్ఫటికాక్షమాల కేలంబట్టి యొక కేలఁగమండలువు ధరించి
వ్యాఘ్రపాసను నామములుచ్చరింపుచు రెండవ సదాశివుండని జనులుభ్ర
మింప నొక్కసిద్ధుండెదురయ్యె, వానింజూచి రాజశేఖరుఁడు సభక్తికం
బుగ సాష్టాంగవందనం బాచరించి యిట్లనియె. ఎందుండివచ్చితిరెచ్చ
టికి విచ్చేసెదరు నామమెయ్యదియనిన సిద్ధుఁడిట్లనియె. అరుణాగిరినుండి
వచ్చితి. హిమనగ్నగమున కరిగెద. నాపేరుస్వచ్ఛందుఁడు నిన్నుంజూడ
నీవృత్తాంతమంతయుఁ దెలిసె. వినుము నీకొక్కమేలు చేయుదు. ఒకచె
లియనుమోహించితివి. అదినిను బిలువకున్న తహతహ పడుచుంటివి.
భయపడకుము నీకొకభస్మమిడికనిచ్చెద. అదినీకోరిన నెలతలకు నొడ
ళ్ళపయి జల్లితివేని వా[illegible] వశ్యలవుదురు. అనితన కక్షపాలనున్న యు
మాల్యసంపుటస్థిత భసితపుటికం దీసి యతనికిచ్చి యెందేనియుం జని
యె. రాజశేఖరుఁడా సిద్ధుంబ్రస్తుతింపుచు నింటికిం జని ప్రహృష్టమానసు
డై మృష్టాన్నములమెక్కి, విచిత్రగంధమాల్యాంబర భూషితుండై వే
శ్యాగృహంబున కొక్కరుండ పోవుచుండె, వేశ్యాగృహంబు దరిఁజేరు
డు నొక్క కాలాహి కాలు బట్టికఱచె. అట్లయినను ప్రియురాలిం జూచు
వేడ్కయు భోగింపవలెనను కౌతుకంబును ద్వరపెట్ట పాముకాటును బా
టింపక దానియింటికింజని సిద్ధుడిచ్చిన భస్మంబిద్దఱు నుదుటదాల్చిరి. త
న్మహిమంజేసి యాసుందరి కారాజశేఖరునందుం దగులుమిగిలె. అట్టిద
అన్యోన్య ప్రేమభరంబునంగు సుమాస్త్రక్రీడారతిం జొక్కియుండిరి. స
ర్పవిషంబు వీటునివీర్యంబునంబడి కామినికిం దలకెక్కి యిద్దఱు నొక్క
క్షణంబునం గాలధర్మంబునొందిరి. అపుడు యమభటులను దర్వాత
శైవభటులునువచ్చిరి. శైవభస్మాను లేపనదేహులై యుండంజూచి
యామ్యభటులుచేర భయమొందిరి. దరిం జేరరైరి శైవకింకరులాదంప

తుల దివ్యవిమానమున నెక్కించికొని శివలోకంబుంజేర్చిరి. కావున సా
నందా భస్మ మహత్వంబిట్టిదిసుమీ, ఇంకొక్క యితిహాసంబు సెప్పెద
వినుమని యముడిట్లనియె. తొల్లిశివభక్తుఁ డొక్కఁడుండు వలువచెంగున
రుద్రాక్షంగట్టి విప్పనుఱచి యూవస్త్రముం జాకికి నుదుకవేసె. అరజ
కుఁడా బట్టయుదుకుచు నందలి ముడివిప్పి యందున్న రుద్రాక్షుందీసి తన
పాగచెఱగునంగట్టె చుట్టుకొనియె. వాఁడుకట్టెలుదేర నడవికేగి కుఠార
మునం జెద్దమ్రానొకటి నఱుకుచున్ననది వానిపైఁగూలె. దానవాఁడుమ
డిసె. అంతవానిని శమనకింకరులు పట్టంబోయిన శైవభటులదలించివా
నింజేకొని రపుడు మాభటులీలోభికి నేపుణ్యంబున భవునిలోకంబుకలి
గెం జెప్పుడనిరి. వారిట్లనిరి వీఁడురజకుఁడుగాఁడు పావనుఁడు వీనితలగుడ్డ
యందొక రుద్రాక్షగలదు దానంజేసి శివసాలోక్య మాలోకింపం బా
త్రుండయ్యెనని వానిని దివ్యవిమానారూఢుం జేసికొనిపోయిరి. మఱి
యు వినుము. తొల్లిపుళిందదేశమున మూఁకుఁడను కిరాతపతి యొక్కఁడు
గలఁడు. వాఁడొకనాఁడు రూర్యోదయమున మేలుకాంచి చల్దిదిని ధనుర్బా
ణంబులుపూని యరణ్యమునకరిగి వేటాడుచుండె. అయిన నొక్కమృ
గంబుదొరకదు. నలంబడదు. ఉఱింబడదు పక్షికిదగిలిద్దు దొరకదు జా
గిలంబు లూరకయెవచ్చె. ఇట్లుండంగిరాతుం డుస్సురనుచు నాకసంబు
నం బొఱుచున్న యొక్కహంసంబుంజూచి నిశ్శాతశాయకం బొకటివిడి
చె. తద్బాణపాతవేగంబున రాజహంస పద్మవనంబునంబడియె. దానినో
టనున్న హేమపద్మంబుజలంబుతోడ నొక్కశివలింగంబు పయింబడియె.
అంతంగాలాంతకుండు కరుణారసభరితాంతఃకరణుండయి యమ్మహాలిం
గ మధ్యముననుండి బ్రహ్మాదిదేవతలు స్తుతియింప ఋషులు రుద్ర
సూక్తంబు పఠియింప. వృషభవాహనారూఢుండై కానుపించి యిట్ల
నియె. కిరాతనాథా నిన్నుమెచ్చితి.

నీకిష్టంబగు వరంబడుగుము. ఎంతకాలమునుండియో యిక్కడనుంటి.
ఎవ్వరుపూజింపరయిరి. ఇన్నాళ్ళకు జలాభిషేకంబును బూజయు నీవల
నగలిగె. శిశిరసలిలము శిరమునబడియె. ఒడలుచల్లనయ్యె. ఉల్లముపల్లి

వించె. బహుయుగములనుండి యిట్లుంటి నీ ప్రమద్భక్తులతో నుత్తముడవు. వరంబు వేడుమన్న నెఱుకకుదత్సన్నిధానవిశేషమున నెఱుకకలిగి వడవడవడకుచు నిట్లని వినుతించె. జయ కైలాసవాసా, జయవాసవాదిసురలోకవంద్యా, జయమానసపీయశోవిశాలా, జయనీయభక్తహృదయనివాస, జయహీరపటీరతుషారచారుతరాకారా జయవైరివీర వారభీకర, హితమునీంద్రరక్షావ్రతా, యని చాగిలబడి మ్రొక్కి పలుమఱు బ్రస్తుతులొనర్చె. మఱియు స్వామీ నన్ను మన్నింపుము. హంసంబుం గరుణింపుము. మీకు జలంబుం దెచ్చిన యంచను బ్రొట్టనింపుటకై చంపితి నావలన దయగలిగితిరి. భాగ్యము కలిగె. అనిన విని గిరీశుండు కిరాతునాత్మశుద్ధికి మెచ్చి హంసంజూచి చేతులనిమిరి యిట్లనియె. మరాళరాజమా నీపుష్పంబు నుదకంబు మాకిరింబునంబడియె. నీకనంతమహిమగలిగె. ఉత్తమలోకంబులు కలిగె. నీకిష్టమగు వరము కోరుకొమ్మనుడు హంసము శైవసేవాపరాయణాత్వము గలిగి యిట్లనియె, గంగోత్తమాంగా. కరుణాంతరంగా, వామదేవా, శివా, భవ, సోమ, భీమ, సోమకోటీర, శర్వ, భర్గ, శంబర, చిన్ముద్ర, భద్ర యోగనిద్రా, రుద్ర, భవహర, భువనవరేణ్యా, బుధజనగణ్యా, మోక్షప్రదా, ఫాలేక్షణా, యనినుతించి మహాత్మా కిరాతునికి ముక్తిభుక్తులనిమ్ము. వాడుకోరినవరములిమ్ము జలమును జలజమును నీకొఱకు దేరలేదు. నాపిల్లల మేతకు దెచ్చుచుంటి. పుణ్యాత్ముడగు కిరాతుండు గొట్టిన విడిచితి. నీలింగంబుపయింబడియె. ధన్యంబనైతి కరుణింపుము, నేను వరముకోరదగను. ఎఱుకగోరిన వరములిమ్మనిన నమ్మరాళరాజంబు పలుకులకలరి హరుడు, కిరాతా నిన్నును హంసంబును మెచ్చితి. మీకింక జన్మంబు లేదు. సాయుజ్యమిచ్చితి. అని వారలంబలికి శివుండంతర్ధానంబునొందె. అనిన సానందుండు వార్తాపులకాంకితశరీరుడయ్యె. యక్షుండు మఱల నతనికిట్లనియె. ఈపాటి ధర్మసూక్ష్మమైన నీపాపులయందు లేదు కావున నీరొల్లు మహాశైవుసాలోక్యంబు జేరగలుగుదురు. అని ముందునడిచి యచట మహారౌరవాదినరకములంబడి దుఃఖింపుచున్న యన్నులంజూపి వవి నుతునిట్లనియె. అది

కొందఱు కింకరులు మండలాగ్రంబులం గండలు చెక్కుచున్నారు. అంకు
శములం బాంకములఁ గాచుచున్నారు. కొందఱం గరపత్రంబులం గుచమండ
లములు దఱుగుచున్నారు. కొందఱం గ్రొవ్వాడి బాడిసెల మాంసంబులు
చెక్కుచున్నారు. వంకకత్తులం గొందఱ నాసికాకర్ణదేశములం గోయుచు
న్నారు. కొందఱం గేశబంధంబులం బాశంబులం గట్టి కశలం బెట్టి మోదుచు
న్నారు. కొందఱ నసలాకుల నుదరప్రదేశంబులం బెట్టుచున్నారు. కొందఱం
జిఱుతసూదికత్తుల వాతెఱలు చీలికలు చేయుచున్నారు. కొందఱి దేహంబు
లు బండల పయిం బెట్టి నడకత్తులతో నఱుకుచున్నారు. కలగానుగుల నిడి
కొందఱ నాడుచున్నారు. శూలంబులం గొందఱి మదనాలయంబుల జొను
పుచున్నారు. వేడికొఱవులం గొందఱ శూడుచున్నారు. సన్నకుండంబులం
గొందఱం ద్రోయుచున్నారు. తైలఘటంబులఁ గొందఱ నుడికింపుచు, భుగ
భుగ పొగలెగయుచు మండెడు నుక్కుస్తంభంబులఁ గొందఱ నంటఁ గట్టుచు
మంగలంబులం గొందఱం గత్తి వేపాకు భంగిం గమలునట్లు వేపుచుం దందశూ
కములచే గొందఱ మర్మస్థానములఁ గఱపింపుచు, వృశ్చికకూపములం గొం
దఱం ద్రోయుచు, మలమూత్రక్రిమికీటక దుర్గంధ మహాంధకారబంధుర
నిరయగుహాలలో బడనూకుచు. చండకరకిరణసంతప్తసైకతస్థలంబులం
బులం గొందఱం బిఱ్ఱబిఱం బొరలింపుచు సీసంబు గాచి కొందఱి ముఖగ
హ్వరంబులం బోయుచు, ఘోరవిషంబులఁ ద్రాగుమని కోఁడికత్తుల నాడిం
పుచు, గొందఱి దంతంబు లింతింతలుగా రాల మొత్తియుం గొందఱి కటిప్ర
దేశముల నీడ్చియు, గొందఱ విఱిచి కట్టియు. నిట్లనేక భంగుల భంజింపంబ
డి పాపాత్మకలగు నబలలు దుఃఖింపుచున్నం గనుంగొని సానందుఁ డాత్మగ
తంబున యముని నిర్దయతకు గోసి సమవర్తీ నీవు కృపామూర్తివి. నా
రాయణభక్తుండవు. నారీజనంబు నెడ లేశమాత్రము దాక్షిణ్యము లేదు,
కారణమేమి, వీరీదుర్గతి నేల పొందిరి చెప్పుమన్న శమనుఁ డిట్లనియె. ఈ స్త్రీ
లదురితము లనేకము లనేకవిధములు తత్ఫలం బనేక నరకముల మూలమున
ననుభవింతురు. ఈ లేమ తన మగని విడిచి యన్యపురుషుని మనసున దలచె. ఇ
ది యత్తమామల, బంధువుల, సజ్జనుల, దూలనాడెను. ఇది మహాకోపన

తనపెనిమిటి యన్యస్త్రీసంసక్తుడయిన నీగాంతమగనికప్రియములుపలి
కె. మగడుజంగాలకుబెట్టుమన్న వెగటునొందిదాసరులకుబెట్టెనిది. విభుం
డుగోపించి కొట్టినమఱలంగొట్టంజూచునిది. అన్నముబెట్టునపుడుపంక్తి
భేదముచేయు నీపలుభీజురాలు, ఇదిరాత్రిపగలు, పైగలచేతను పగల
చేతను, జాణతనముచేతను, విటులరప్పించి మన్మథకేళిందేలును, మగ
డు, భాగ్యము గలిగి బలముగలిగి యున్నపుడు నీవేమన్మథునివంటివాడ
వనికొల్చినది, భాగ్యము బలముంబోయిన నన్యుని మఱిగినది. ఇది దా
సీదాసాదులకువట్టియూసలు పెట్టి యింటిలోనివస్తువులన్ని దాచికొను దు
ర్వారురాలు. మగడు మాటాడిన ఫెళఫెళమెటికెలువిఱుచుచు, దిట్టుచు
బొట్లుపొడిచిన కలహశీలయీబాల, పురుషుడుచచ్చినంబిడవిఱుగడయ్యె
ననిపరపురుషుంజేరె నీచెనటి, భర్తకుబెట్టక మునుపెపంచభక్ష్యాన్న
ములు భుజించునీగయ్యాళి. పెనిమిటికి బగవాడగువానితో సరసాలాడ
బోవునిది. ఈనీచురాలు పెనిమిటికోపించునని పొరుగిండ్లకుంబోయి డా
గును. మగడేమే యేమేయని నోటబదిమాఱులన్నంగోపించి పోపొమ్మ
న్న, నాథుడు మాన్మథకేళికిరమ్మన్నంబాఱిపోవును. యీపొమ్మకూరలు
వండునపుడందున్న పురుగులనేఱి పాఱవేయక కలిపివండును. ఇమ్ముచెచ్చె
కంటివంటకట్టెయున్న కీటకంబులదీయకయె పొయ్యింబెట్టు. ఇదిమ
గనిదగ్గఱకిరానీయదు. అదిబొంకులాడి. ఇది కండక్రొవ్వున మగనినోటికివ
చ్చినట్లు తిట్టును. అదిపెనిమిటిపాలిటిమిత్తి. అదిపెద్దలన్న భయములేనిది.
ఇదిగొఱ్ఱడాలు. అదిమృతవంధ్య. ఇదిగోళకులతల్లి. ఇదికుటిలాత్మురాలు
యిది ముట్టయినసింటగలుపును. అదిహృదయేశునికిష్టముగాని పనులుచె
ప్పి నిర్బంధించును. ఈశిఖండినింగనుంగొనుము. ఒక్కమగనినింటిలో
నుంచు. ఒక్కనివాకిటబెట్టు. ఒకనితోనవ్వు ఒకనితోమాట్లాడు. ఒకని
తోసయిగజేయు. ఒకనికిముద్దిచ్చు- ఒకనింగౌగిలించుకొనును- ఇకొక్క
నింగూడును- ఇదిఅంకుమగలకు నెదురువెట్టికూడును. పెనిమిటిసంపాద
నగడిగిపెట్టును- పెనిమిటిమర్మంబులు వెలిసేయును- పుత్రులనుబుజ్జగొల్పి
తండ్రితోబోరించును- బంధువులతోగలహించును- సురదాగునుమాం

సముదినును. ఈబోటియిరుగుపొరుగులవారు కలిమిగలవారలని యో
ర్వలేమిగలదయ్యె. తనకులేమియె కాన నిత్యము పొరుగువారితో వివా
దపడుచుండు నీపడతిజూడు. అమ్మా బిచ్చమన్నంబీదలంజూడగనే తల్పు
గడుపెట్టునీమిటారి. బంధువులు మిత్రులు వచ్చిరామాటయిననాడదు.
పాంథులంజూచి శయనాసనంబులడిగిననీయదీమాయలాడి.

అని యిట్లు స్త్రీధర్మంబు లెఱుంగంజెప్పి వెండియు దండధరుండప్పు
నిమంత్రనునకిట్లను, ఈనారకులనుభవింపదగు నరకంబులిరువదియెనిమిది
కోట్లుగలవందునే నెఱిగినకొన్నిటివివరించెద వినుము. అతిఘోరము, సు
ఘోరము, మహాఘోరము, ఘోరము, తరళము భయానకము, కాల
రాత్రి, భయోత్కటము, చండము, మహాచండము, చండకోలాహల
ము, కరాళము, విరాళము, వజ్రము, త్రికోణము, పంచకోణము, ష
ట్కోణము, దీర్ఘము, సప్తభావనము, అష్టభావనము, దీప్తము, మా
య, మహామాయ, రౌరవము, శీతము, మహాశీతము, తమము, ఉష్ణ
ము. సుతీక్ష్ణము, శస్త్రసంజీవనము, మహాపద్మము, శతము, అతిలోక
ము, భీమము, తీవ్రము, మహావేగము, ప్రకంపనము, సువిక్రమము,
కాలసూత్రము, ప్రప్రస్థనము, సూచీముఖము, నేమి, ఛాదనము, సు
ప్రతీకము, కుంభీపాకము, కూపము, అంగారరాశి, భవము, అసృక్పూ
యహ్రదము, అనిష్టాలయము, తుండశకుని, సంవర్తకము, మహాసం
వర్తకము, పంకలేపము, మూత్రవిష్ఠాకూపము, పూయకూపము, శా
తనము, శిలాశకటాలింగనము, ద్విపాదము, అతిజరంతిమంబు, అతిదుః
ఖంబు, మహాదుఃఖము, కశ్మలము, నానాయంత్రము సమ్మోహము,
అతిభంగము తప్తశూలము, హాలాహలము, అతికూపము, ఏకపాద
ము, మలము, మలపర్వతము, ప్రపూరణము, తప్తశిలాతలము,
మొదలుగాగల మహానిరయములునింకంగలవు. అనిసానందుండు లో
నెట్లనుకొనె. శివపంచాక్షరి నారకులందఱు వినునట్లు బిగ్గఱగబలికెద,
అదివీరువినిరేని సమస్తపాపములవలన విముక్తులయి నరకమునుండి తొ
లగిశివలోకము నొందగలుగుదురు. అనినిశ్చయంబునొంది తహారాకా

శంబున నాకాశ కేశునినిల్పి, కనులుమూసి శంకరాభక్తవశంకరా, నీ యపారకరుణంజేసి యీనారకులు నరకమునుండి విడివడుదురుగాక, అని శివసాన్నిధ్యము గల్పించుకొని, సమస్త కళ్యాణాభిరామమును, సప్తకోటి మహామంత్రసార్వభౌమమును, నిఖిలవేదవేదాంత మధ్యనాయకరత్న 'మును, నిర్వాణసౌఖ్య సామ్రాజ్యరత్నమును, సకలకలుషారణ్యదావ పావకమును, సగుప్రణవసహితపంచాక్షరీమంత్రము, మహామేఘగంభీరరవంబున నుచ్చరించె. అంతధర్మప్రసంగాది మహామునులుగూడనమ్మహామనురాజమునుచ్చరించిరి. తద్ఘోషంబులష్టావింశతినరకవాసులకుగ్గర్ణంబులంజొచ్చె. తత్క్షణమయముడు నివ్వెఱపడిచూచుచుండ నారకులు సకలపాపనిర్ముక్తులయి రుద్రగణాకారములుదాల్చి విమానారూఢులయి నిజాంగదీప్తులు దిశలవెలుగ భసితాంగరాగులును. భస్మరుద్రాక్షధారులును, జటామండలమండితులును, గంగోత్తమాంగులును, శూలపినాకధారులును, గజాజినవ్యాఘ్రచర్మపరిధానులును, లలాటనేత్రులును, హాలాహలకంధరులును, భుజంగహారకేయూరులు, వృషభధ్వజులు, సర్వజగంబు " శివాత్పరతరంనాస్తి " యనువాక్యముగానేవంకజూచినశంకరాకారంబయి తేజరిల్లం బరమానంద కందళిత హృదయారవిందుండయి సానందుండు నారకులందఱం గయిలాసంబునకు రానుగ్రహింప దండధరు సుఖంబుండు మని దీవించితానును మునిజనములతో విమానమెక్కి నారకులం దోడ్కొనిపోవుచుండె అపుడుకోటి దశకోటి శతకోటివిమానములు కైలాసాభిముఖంబుగ బోవుచుండె.

ఈరుద్రగణ విమానములంజూచి దేవతలు పుష్పవర్షము గురిసిరి. దేవతాభేరులు మ్రోగెను. అప్సరసలాడిరి. ఇట్లునారకుల విమానములతోజని సానందుండు కైలాసపర్వత పూర్వప్రదేశంబున విమానంబులు నిల్పిడిగ్గి, రుద్రలోకము రుద్రగణములతోజొచ్చి పోవుచో నెడనెడగలుగు శివయోగిపుంగవులంగని మ్రొక్కుచు, భవుభవనంబుకడంజేరి బ్రహ్మాదిదేవతలును, మునిపుంగవులు, విప్రవరులు. గొల్వ హేరమణీపీఠమున మహాదేవీసమేతుడయి మహాదేవుడు గొలువున్నం గ

న్నులారం గనుంగొని యానందబాష్పవిహితనేత్రుఁడై సానందుండు సా ష్టాంగవందనం బాచరించి ఫాలకీలితకరకమలుండై యిట్లనివినుతించె. మేరుకోదండా, పుండరీకాక్షకాండా, యార్తజనత్రాణ, యఖిలకల్యా ణగుణా, మేషాంకధరా, ధరాధర కుమారికాధరా, కాలకూటాహార గజాసురసంహారా, ముక్తిదాయక, భక్తమందార, దిగంబర, కైలా సవాసా, యాదిమధ్యాంతశూన్యా, యమరవరేణ్యా, దివ్యలక్షణా, ద క్షాధ్వరధ్వంసకా, నిటలనేత్రా, తారకబ్రహ్మనామ్న, దేవానీనఖిలాధి నాథుఁడవు. నీమహిమవర్ణింప వేదంబులుంజాలవు. బహువిధభేదంబు లగు జీవులయందుండి బ్రహ్మంబవయి వెలింగెదవు. తేజోమూర్తివ గు నిన్నును తింప నేనెంతవాఁడ, నీదయచేతనేకదా యీదురంతపాపు లు నరకంబువదిలి నీపదవనజంబులు చేరగలిగిరి. అనికొనియాడిన నగ జామనోహరుఁడా సానందుంగౌగిలించుకొని తొడపై గూర్చుండఁబెట్టికొ ని, కరుణాకటాక్షముల నీక్షింపుచు వత్సానీభక్తికి సంతసించితి. గొప్ప సాహసకార్యముచేసితివి. ఒరులిట్టికార్యము చేయజాలరు. నీవునాపుత్రు డవు. ఈనారకులకు నాసన్నిధి యిచ్చితి. అందఱిందుండఁదగు అనియొన ట యముఁడును సానందునివలన దనలోకంబు శూన్యంబయి తనకుబని లేకున్న నలిగియే నిక్కడనేమిచేయుదు. శివునిలోకంబున కేగి యతనిం జూచి యీవృత్తాంతంబుచెప్పి యమపాశంబును, దండంబు నతని కర్పిం చివత్తునని మహిషవాహనమెక్కి గృధ్రకేతనముగ్రాల చిత్రగుప్తాదిమి త్రులును, కవ్యవాహనప్రముఖ పితృదేవగణంబులును, వీరసేనప్రముఖ కింకరవర్గంబును, మతంగాదిమహర్షులును, బలిసికొలువ బయలువెడలి యుత్తరాభిముఖంబుగం జనిచని నిఖిలేశ్వరు లోకంబుగాంచి బహిర్ద్వా రంబు నలులయంబుం డిగ్గినందికేశ్వరునకుం బ్రణమిల్లి, యతనిచేనను జ్ఞాతుండై చొచ్చిపోయి పురోభాగంబున శస్తచామీకరకుడ్య ప్రాకా రితంబును, పద్మరాగకుట్టిమ ప్రభావిరాజితమును, దేదీప్యమాన కనకాం బరవితాన భాసమానమును మరకతమణి కవాటద్వారగేహళీ నిరా ఘాటకంచుకితంబును, ఇంద్రనీలనిటంక ప్రకీర్ణకంబును, వైడూర్యవా

తాయనంబును, విద్రుమస్తంభసంభృతంబును, సాంద్రచంద్రకాంచనసో పానవిస్తారంబును, లంబమానప్రసూన దామాభిరామంబును సచ్చిదా నందమయంబునగు మహాదేవుని సభామంటపంబున, చతుర్ముఖశతముఖ శతమఖావరజ ప్రముఖనిఖిల బర్హిర్ముఖులును, ద్వైమాతురకుమారము ఖర కుమారులును, భైరవవీరభద్రకాలాగ్ని రుద్రాదిరుద్రులును, సన కసనందన సనత్కుమారసనత్సుజాతనారదవిశ్వామిత్ర వసిష్ఠమార్కం డేయ, కుంభసంభవ ముఖ్యసనాతన యోగీంద్రులును, భృంగిమహాకా లాది ప్రమథగణంబులును, బరివేష్టించికొలువ మాణిక్యసింహాసనమ్ము సం బరమేశ్వరుండీశ్వరీ సమేతంబుగా నిండుకొలువైయున్నం గన్నులపం డువుగాదర్శించి, దండధరుండు కాలదండకాలపాశంబులు ముందటబెట్టి సాష్టాంగవందనం బాచరించి, సంభ్రమంబునం గరసరసిజంబులు మో డ్చి యిట్లని స్తుతియించె.

శివా, శివానాయకా, శృంగారగుణాకరా, గంగాసనాథా, స త్కర్మబోధా, ముక్తిమార్గాధారి, భవవిదూర, పాపహరా, హారా మ స్తకస్థితచంద్రా, కరధృతసారంగ, తనుకాంతిజితచంద్ర, దర్పకభం గ, వైరివిరామయని యనేకవిధములంబొగడి దీనాననుడయి యిట్లనియె. ఓ పార్వతీశ్వరా శర్వా యిక నాయుద్యోగ మేటికై సనిమ్ము. నాపురంబీతా పసున్ని మూలంబునం బాడువడియెనేనేలనేల, నాపురికిఁ బాపడేతెంచి నార కులంబరీక్షించి వారిమొలబలాలకించి తనమంత్రప్రభావంబున నందఱు నారకుల నీలోకమునకుం దెచ్చె. చిత్రగుప్తుడు లెక్కలు దెచ్చినాడు. వీ రలపాపములువినుము. ఒకనాడైనంబుణ్యంబు చేసి యెఱుగరు. నీపూజచే యరు. నీయందుభక్తిలేదు నీచిన్నెలుధరింపరు. విభూతిపూయరు. కట కటా యీపాఱుడెంతపుణ్యమున కొడిగట్టుకొనియె. మార్కండేయుని కైనన్నుశిక్షించితివి. నాటనుండి నాభటులు శివభక్తులజోలికిబోరు. పా డువడిన రాజ్యంబునేనేల్ల నన్నంబన్నగ భూషణుండునగి యిట్లనియె. ధ ర్మరాజా సానందుండు మహానుభావుడు కృపాసముద్రుడు పరులబాధ జూడజాలక పంచాక్షరీ మంత్రప్రభావంబునం బాపులపాపంబులు పా

యుంజేసి ముక్తింగావించె. ముత్యంబులైన జలంబులు మరలజలంబుల
గునె. నాలోకమునకు వచ్చినవారెట్లు గ్రిమ్మఱ నీపురికివత్తురు. నీవుపొ
మ్ము. నీకుమరల నరకమునకు మర్త్యభూమినుండి పాపులురాగలరు. నె
మ్మదినొంది వారింబాలింపుము. నీకేర్పడిన రాజ్యంబునకు నీవెకర్తవు.
పొమ్మన్న యముండు శివునికి నమస్కరించి యనుజ్ఞగైకొని తనపరివా
రంబుతో నిజలోకమునకేగెను. అనిసూతుండు శౌనకాదిమహామునుల
కుజెప్పె. ఈచరిత్రవినిన వ్రాసిన జదివినవారికి శివానుగ్రహమువలన స
మస్తభాగ్యములు గలుగును. తుదను శివసాలోక్యముసిద్ధించు. ఈసానం
దోపాఖ్యానము నెవ్వరేమిఁ గోర్కెతో జదివిన వారలకా కోర్కె లీడేరు.
నరకార్తినొందరు. శ్రీ శ్రీ శ్రీ.

సంపూర్ణము.



# ప్రచురపత్రిక.

కోవిదులారా! ఈక్రింద నే విన్నవించు విషయములను మీరు
గ్రహించి మీస్నేహితులకు గూడ దెలుప బ్రార్థితులు. నేనిచటికెనిమి
దిమైళ్ళ దూరముననున్న కాకినాడ వాస్తవ్యుడను. గోలకొండవ్యా
పారి. నాపేరు మంగు వెంకటరంగనాథరావు. ఆంధ్రవిద్యాభివృద్ధిగో
రి నేనీగ్రంథవ్యాపారమును జేయుచున్నాడను. నాకడ 3 పైసలు మొ
దలు 4 రూపాయలవరకు విలువగలిగి సమస్తవర్ణములవారికిని. బాలు
రు యౌవనులు వృద్ధులు నగు స్త్రీపురుషులకందఱకు ననుమోదకరం
బులగు సంస్కృతాంధ్ర గద్య, పద్య, మిశ్రమాది గ్రంథములు వేయి
విధముల గ్రంథములు గలవు. వీనియందచ్చుతప్పులుగాని స్ఫుటలోప
ములుగాని లేక దళసరికాగితములపయి ముద్రింపబడి స్వల్ప మూల్య
మునకే యివివిక్రయింపబడుచున్నవి. తెలియనివారు కొందఱిది ధనార్జ
నాపరతచే వేసిన వేషమనియు నీగ్రంథములు చెన్నపురి గుజిలీయంగడి
లో నొమ్ముడు పోనిగుట్టలలో వేలమువేయగా చౌకగాగొని మఱలనీయ
న యిచ్చుట నమ్ముచున్నారనియు నాపై నొకయపవాదమును వేసియున్న
రు. నాగ్రంథములు 1913—1914 సం॥రములలో ముద్రింపబడినవని
యు నాకడదప్ప మఱియెక్కడను నాగ్రంథములితరస్థలములందు దొరక
వనియు వక్కాణించి చెప్పగలను. గ్రంథములనుజూచినను దేటపడగల
దు. గ్రంథములు కథకుదగిన శైలితోడను బాకముతోడను నొప్పుచుం
డును. స్త్రీలకుపయుక్తములయిన హరిశ్చంద్రోపాఖ్యానము, శ్రీకృష్ణ
భక్తసంవాదము, నలచరిత్ర, శశిరేఖాపరిణయము, సానందోపాఖ్యాన
ము, సింహాచలపద్మనాభ, కాంచీక్షేత్రమహాత్మ్యము, అధ్యాత్మరామా

యణము, విశ్వగుణాదర్శము, పతివ్రతలచరిత్రలు మున్నగు ననేక వచన ప్రబంధములుగలవు. కొని చదివి చూచినచో వానిప్రశస్త్యము మీకే విశదము కాగలదు. నాగ్రంథములను నేను బొగడుచున్నాడనని యెంచవలదు. నాగ్రంథముల పట్టికయందు జెప్పబడినదిగాక యితరగ్రంథములు కూడగలవు. వలయువారు వ్రాసినచో బంపగలము. మాకొకముద్రాక్షరశాలకూడగలదు. ఆంధ్రగీర్వాణ పురాణ గ్రంథము లెవ్వియైన నచ్చొత్తింపగోరినవారికి తగిన వెలల కచ్చొత్తించి యీయగలము. లేక పుస్తకముల కాపీరైటు మాకొసంగినచో నచ్చొత్తించి కొన్ని ప్రతులు వారికిత్తుము. రిప్లయికార్డు వ్రాసిన జవాబీయబడును.

గోదావరి జిల్లా. కాకినాడ.

ఇట్లు విధేయుడు,

మంగు వెంకటరంగనాథరావు.

# ప్రకటన.

మావద్ద ౧౦౦ రకముల పెద్దచ్చుశతకములు. ౧౦౦ రకముల హిందూస్త్రీలపాటలు ౫౦ జాతులకథలు యింకా అనేకవిచిత్రములగు ఆంధ్రగీర్వాణ గ్రంథములు తప్పులులేకుండ దళసరి కాగితములపైని ముద్రించి చవకధరలకు విక్రయించబడుచున్నవి. అర్ధణా ష్టేంపులుపంపితే కేటలాగు పంపుచున్నాము.

గోదావరిజిల్లా, కాకినాడ.
శ్రీ వేంకటేశ్వరవిద్యాసాగరప్రెస్సు.
మేనేజరు, మం[illegible] వెంకటరంగనాథరావు.



